# యోసేపు చరిత్ర

## నాటకము



మధురకవి :

పిడపర్తి ఎజ్రా
బోస్‌నగర్, తెనాలి - 522 201

1988

కృతిస్వామిని

శ్రీమతి పద్మనమ్మ



## అంకితము

ఆ॥ అందుకొనుము కావ్యమత్యంత ప్రేమతో
అంకితంబునొసగ అమలచరిత
ప్రభువు మెచ్చినట్టి భక్తుడు యోసేపు
నీతిచాటుగాను నెలమిమీద

# అభిప్రాయము

బహుకాలమునుండి మధురకవి శ్రీ పిడపర్తి ఎజ్రా గారితో పరిచయము గలదు. వీరి రచనలంటే నాకు ఆశక్తి మెండు. అందువలన వీరచ్చొత్తించిన పొత్తములను విత్త మిచ్చి నా సొత్తు చేసికొన్నాను. ఎందుకంటే పరిచయాన్నిబట్టి నాకు బహుమతిగా యిచ్చినా వారిసీరంగములో ప్రోత్సహించవలెనని ఉచితంగా గైకొనక విత్తమిచ్చి గైకొనే వాడను. వీరు కవిత్వాన్ని కేవలము క్రీస్తు మహిమకొరకే వాడిన భక్తుడు.

అభ్యుదయ భావములు కలిగిన వ్యక్తి. మంచి సంఘ సంస్కర్త. నవరసభావ సమ్మిళితమైన యోసేపు చరిత్ర హరి కథగా విన్నాముగాని, నాటకముగా ప్రదర్శించబడుట చూడ లేదు. ఎజ్రాకవిగారు వ్రాసిన ఈ గ్రంథము ప్రదర్శించుటకు చదివి ఆనందించుటకు పేరెన్నికగల గ్రంథము కాగలదని నా విశ్వాసము.

దేవుడు తనకు దానముగా యిచ్చిన యీ తలాంతును ఆయన మహిమ కొరకే వాడి ఆయనను ఘనపరచిన యీ మధురకవి అన్ని విధాల శ్లాఘనీయుడు. భక్తిరసాన్ని చాటుటే వీరి ఆశయము. దేవుడు యీ మధురకవిని మన ప్రోత్సాహము ద్వారా దీవించుగాక.

తెనాలి
16-8-88

రెవ. దేవరపల్లి రత్నము
మిషను కాంపౌండు

# కృతిస్వామినీ ప్రశంస



సీ॥ మహిళారాజగంబున మణులనే తలదన్ను
స్వచ్ఛతగల్గిన సాధ్వివమ్మ
ఉన్నత విద్యను మిన్నగా చదివినన్
గర్వమెఱుగనట్టి కాంతవమ్మ
మైనపు ముద్దలన్ మలిచెడి వృత్తిలో
పలువురు మెచ్చిన పడతివమ్మ
దైవభక్తిగలిగి దాతృత్వమునుగల్గి
ధర్మంబుజేసిన తల్లివమ్మ

ఆ॥ రత్నతుల్యమైన రమణీయ సంతతిన్
ఇమ్మహిని బడసిన యింతివమ్మ
అట్టిపద్మనమ్మ కంకితంబుగనీయ
మురియుచుండె కావ్యముగ్ధరాలు

ఆ॥ శక్తుడగు మలాకి ప్రథమంపు బిడ్డవై
దిడ్డివారి వంశ ముద్ధరించి
ఖ్యాతిగాంచినట్టి కమనీయ గుణనిధి
ప్రభువు మెచ్చినట్టి భాగ్యశాలి

ఆ॥ దుర్దినంబురాగ దూరమైతివి తల్లి
కాలమిత్తి నిన్నుకాటువేయ
మధ్యవయసునందు మమ్ములన్ దిగనాడి
దూరతీరములకు చేరినావు

ఆ॥ పేరుతెచ్చినావు పిదప శ్రీవారికి
"ఎ్రజ" యనెడి కవికి నింతివయ్యి
సుఖము బడయకుండ నిఖిలంబుపీడిన
తీరుతెన్నుగాంచ దిగులుమాకు

ఉ॥ ముగ్గురు బిడ్డలన్ననియు ముచ్చట తీర్చిన పద్మనమ్మ తత్
ముగ్గురు విజ్ఞులై భువిని ముచ్చట గొల్పుచు పట్టభద్రులై
మొగ్గలువిచ్చి సౌరభము ముగ్ధులజేసినరీతి యోగ్యులై
ముగ్గురు కీర్తిగూర్చిరిల మోదముజెందగ కన్నవారిలన్॥

ఆ॥ శాముబాబు నిన్ను సత్కరింపగనెంచి
పొత్తమచ్చువేయ ప్రోత్సహించె
ఆరలేదు వారి యశ్రుబిందువులింక
పుడమిపైన నేడు పూజ్యురాల

ఆ॥ తల్లిపిదప దక్కె ధరణిని మేరిమ్మ
కన్నతల్లికన్న మిన్నగాను
మిగిలినట్టి పనులు మెళకువచూపించి
చక్కదిద్దుమండె సదమలాంగి.

ఆ॥ కాంచగలమ నీదు కమనీయ రూపమున్
మాయలోకమందు మరల మేము
కంఠశోషదప్ప కంటికి కనరావు
పుడమి వీడినటి పూజ్యురాల

# అభినందన

"యోసేపు చరిత్ర" సంగీత నాటకముగ రచించిన మధురకవి, బహుగ్రంథకర్త, శ్రీ పిడపర్తి ఎజ్రాగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. బైబిలులోని చరిత్రలన్నింటిలోను యోసేపు చరిత్ర ప్రత్యేకత ప్రశంసార్హము. క్రీస్తుకు పూర్వము సుమారు రెండువేల సంవత్సరముల క్రింద యోసేపు ఉన్నాడు. యేసుప్రభు చరిత్ర యోసేపు జీవితమునందు అడుగడుగున దృగ్గోచరమగును నవరసభరితమైనదీ యోసేపు చరిత్ర. ఈ చరిత్ర భవిష్యత్తంతయు "ఆరు కలల" ద్వారా తెలుపబడును. శ్రీ ఎజ్రా కవిగారు అనేక గ్రంథములు రచించి వానిని ముద్రింపించి ప్రజానీకానికి అందించినారు.

ఆ గ్రంథములన్నియు నా కందినవి. చదివి ఆనందించినాను. గాని ఈ యోసేపు చరిత్ర చదివి పరమానందభరితుడనైనాడను. "మధురకవి" బిరుదము సార్థకమైనది. చక్కని సంభాషణలు మంచిపద్యములు, కథాగమనము ప్రశంసార్హములు. మృదుమధురమైన శైలి, ప్రజల, రసజ్ఞుల హృదయముల నాకట్టుకొనగల రచన. సమాజమును అర్థముచేసికొన్న కవి. సమాజమును మేల్కొలుపు సదుద్దేశ్యముతో రచనచేసి, ప్రజాకవి అనిపించుకోగల ప్రజలకవి వీరు. దైవభక్తి, పవిత్ర జీవితము, ఆదర్శకుటుంబము అకలంక చరిత్రగల కవీశ్వరుడీ ఎజ్రాగారు. ప్రజల కందుబాటుగలేని మొద్దు కవిత్వములు భాండాగారములలోబడి మూల్గుచున్నవి చెదలు కాహారముగ. నరకపాత్రులు నమ్మి పొగడెదరా కవితలను. సమాజమున కర్థమయితే లోపములను దిద్దుకొంటుంది సమాజము. కొన్ని వేల సంవత్సరాలు సాహిత్యము ముఖమెఱుగక, చెప్పేడి దిక్కులేక, ఎవరైనా చెప్పినా అర్థముగాక మొద్దులుగా తయారైన సమాజమును ఇలాటి మధురకవులు మేల్కొలుపుచున్నారు వీరి రచనలన్నియు యీ ప్రజలు అర్థము చేసికోవలయుననియు, వారిలో

విజ్ఞానవికాసములు ప్రజ్వరిల్లాలనియు రచియించినారు. కవిత్వం అల్లుతాము అనే గర్వము చాలామందిలో వుంటుంది? వాళ్ళ కవితల అర్థాలను మరొకని కడకేగి వారిద్వారా తెలిసికొనవలసినదేగాని, విన్నయంత లేక చదివినంతనే అర్థము చేసికోలేరు ప్రజలు. శ్రీ ఎఱ్ఱాగారు మృదుహృదయులు, సద్భావ ములుగల మనీషి. మంచిరచయిత, బహుగ్రంథకర్త, ప్రజాకవి యనుబిరుదము నొందదగిన సత్కవి. నరక, కలుషు, దుష్కవుల జాబితాలోచేరక, ప్రజాహృదయాలలో నిలిచిన యీ మహాకవి, బహుగ్రంథకర్తగా ప్రవిమలవక్తగా శతవార్షికోత్సవము జరుపుకోగల దీర్ఘాయుష్మంతులుగా వర్ధిల్లాలని దైవమును ప్రార్థిస్తూ, శ్రీ ఎఱ్ఱా కవిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ ముగించుచున్నాను.

ఇట్లు

14-8-88 | ఆత్రోటు రత్నకవి (అరక)
తెనాలి | రవీంద్రనాథ్‌నగర్

—o—

## జరిగిన సంఘటనలు

నటులైన కొందరు మిత్రులు ఎప్పటినుండియో యోబు చరిత్రగాని, యోసేపు చరిత్రగాని వ్రాయమని విజ్ఞప్తి చేయుచున్నారు. యోబు చరిత్ర నాటకంగా చూచాను, కాని నాటకముగా వ్రాయబడిన యోసేపుచరిత్ర చూడలేదు. ఎవరో వ్రాసినట్లు ఇటీవల విన్నాను. కాని చూడలేదు. అయితే మన బడుగుజాతికి తలమానికమైన ఆత్రోటరత్నకవిగారు నాకు పదిపన్నెండు సంవత్సరాల ప్రాయమున్నపుడే యోసేపుచరిత్ర హరికథగా బహు హృద్యమంగా చెప్పుట విన్నాను. ఆ చరిత్ర హరికథగా అంత గొప్పగా చెప్పినవారు యిప్పటికి లేరంటే అతిశయోక్తికాదేమో!

అందువలన యోసేపు చరిత్ర వ్రాయుట సముచితమని తలంచాను. మేము ఆడతాము, పై రెంటిలో ఏదో ఒకటి వ్రాయమని మిత్రుడు శ్రీ టి. నాగరత్నము అన్నాడేకాని తగిన చేయూతనివ్వలేదు. వ్రాయాలని సిద్ధ పడ్డాను. కాని వయసు భయపెట్టింది వ్రాయడానికి. అరువది సంవత్సరాలు దాటాయి. పద్యాలతో వ్రాయాలి. ఆరోగ్యము ఎక్కడ దెబ్బతింటుందోనని భయపడ్డాను. అలా ఒకటిన్నర సంవత్సరము గడిచినది. జూన్‌లో చల్లబడ్డా పిదప వ్రాయాలనిపించింది. కలముచేతబట్టాను. దైవము నడిపించాడు. జూన్ 20న ప్రారంభించి 27తో ముగించాను. ధైర్యము వచ్చినది. ఆరోగ్యములో ఎటువంటి ఒడిదుడుకు రాలేదు.

మనహరికథాపితామహునికి కావ్యము చూపించాను. నవరసాలతో నిండి కథ ఒక యోసేపు చరిత్రయేనని, అట్టిది నీవు సాధించావని అభినందించి వెంటనే అచ్చువేయించమన్నారు. సరే! వాగ్దానము చేసినవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను కాలహరణముతప్ప కావ్యము ముందుకు రాలేదు. నేనే ధైర్యమువహించి 25 సంవత్సరాలక్రితము నన్ను, బిడ్డలనువీడి మింటి కేగిన నా ప్రియపతీమణికి అంకితమీయ సమకట్టాను. నా బిడ్డలిరువురు సమ యానికి దగ్గరలోవున్నారు. నా నిర్ణయాన్ని తెలియపరచాను పెద్దవాడు డిశంబరులో నేను వేయిస్తానని అభయమిచ్చాడు. చిన్నబిడ్డ ఎందుకులే నాన్నా మీకి శ్రమయని, సరేనని పచ్చజెండా చూపాడు. అల్లుడు, కుమార్తె నా అభీ ష్టాన్ని తీర్చడానికి కొంత ఆర్థిక చేయూతనీయడముతో కావ్యము రూపుదిద్దు కొని మీ ముందుకు వచ్చినది.

ఇక కావ్యానికి హంగులు కూర్చాలి. జగమెరిగిన జాంబవంతులు దృష్టిలో ఉన్నారు. "అ. ర. క." అరక అంటే నాగలికాదు, అత్తోట రత్న కవి. తాను పెట్టుకొన్న ముద్దుపేరు అ.ర.క. వీరు ఎండమావిలాంటివారు. కనబడతారుగాని చేతికిదొరకరు. రెండురోజులుతిరిగాను. మూడవరోజు గరుప పాలెములో దర్శనమైంది. నన్ను సాదరంగా చూచి కావ్యముచూచి ముగ్ధ

లయ్యారు ఆయనంటే నాకు అపారమైన ప్రేమ. అది మాటలతో చెప్ప లేను, అయినా చెబుతాను.

గీ॥ ఘనుడగత్తోటరత్నము కలడు మనకు
కథలు చెప్పుచు నాతడు గడనకెక్కె
కవిగ రాణించుచుండెను కరముగాను
బడుగుజాతికి నాతండు ప్రాణమోయి.

అంతేకాదు. మేము ఏకోదరులము. ఎందుకంటే

ఆ॥ గౌరవించె నతడు ఘనముగా నన్నిల
వ్రాతకోతలందు చేతలందు
మరువజాలనట్టి మహనీయమూర్తిని
ఊపిరున్నవరకు నుర్వియందు

అట్టి మహనీయులు మనకు మిగిలియుండుట మహాఅదృష్టము.ఆయన నా విన్నపమాలకించి ఆ క్షణములో పరిచయము వ్రాసియిచ్చుట మహద్భా గ్యముగా తలంచుచున్నాను. అందుకు వారికి నా హృదయపూర్వక కృత జ్ఞతలు.

అదే రత్నమనుకుంటే నా దృష్టిలో మరొక రత్నము లభ్యమైనది. ఆ రత్నము ఆంధ్రలూథరన్ సంఘమను హేమముతో పొదగబడి బహుగా రాణించినది. తూర్పుగుంటూరు సినడ్ లో ఈ రత్నములేక ఏ కార్యక్రమము భాసిల్లలేదు. తూర్పుగుంటూరు సినడ్‌తో విడదీయరాని అవినాభావసంబంధ మున్న ఎ. ఇ. యల్. సి. లోనే అందెవేసినచేయి. అందుకే ఆయన అమె రికా యాత్ర చేయగలిగారు. స్వయంకృషితో ఆకాశానికి ఎగబ్రాకినారు. ఆడంబరము, లావు దర్పము ఏ మాత్రము కనిపించదు.

ఆ॥ నిందుకుంద పగిడి నిత్యము ప్రత్రించు
దివ్యరత్నమతడు దివికి భువికి
దీప్తినిచ్చునట్టి దేవరపల్లను
వంశముద్ధరించె వసుధయందు.

దైవభక్తుడు, తొట్రుపాటులేదు. ఒక చెంపగొట్టిన వేరొక చెంపనిచ్చు సహనశీలి. అట్టి నిశ్చలభక్తుడు అభిషిక్తుడైన రెవరెండు నా కావ్యమునకు పరిచయము వ్రాయుట నాకు మహద్భాగ్యము. అడిగినంతనే కావ్యాన్ని ఆమూలాగ్రముగా చూచి సంతోషభరితులై పరిచయము వ్రాసియిచ్చినందుకు బహుగా కృతజ్ఞుడను.

వయస్సు ఆరవైదాటిందని మనవిచేశాను. కుడికన్ను ఆపరేషను చేయబడినది. కుడికన్నుకు శుక్లము సగంకమ్ముకొన్నది. సగము ముద్రణ అయ్యేసరికి ప్రమాదములోనుండి బైటపడ్డాను. ఎడమకన్ను కొలికిలో ఆరు కుట్లుపడినవి. అయినా ఓపికతో ప్రెస్‌కువెళ్ళి సాధ్యమైనంతవరకు తప్పులు లేకుండా చూచాను. అయినా తప్పులు దొర్లాయి. నాస్థితిని గుర్తించి పాఠకులు దొర్లిన తప్పులకు మన్నించ ప్రార్థన. యువకులయిన ప్రెస్‌వారు మంచి సహకారముతో అచ్చువేసినందుకు వారికి నా కృతజ్ఞతలు.

తెనాలి
17-8-88

ఇట్లు
గ్రంథకర్త

---

సూచన :- పేజి 48 సీ. ప.లో "చో" బదులు "వో" పడినది. గమనించ ప్రార్థన. నాటకము వేస్తే ఒక కార్డు వ్రాయండి. వచ్చి చూడాలని ఆశ.

# పాత్రధారులు

| | | |
|---|---|---|
| 1. యాకోబు | — | వృద్ధుడు (తండ్రి) |
| 2. యోసేపు | — | హీరో |
| 3. రూబేను | — | కుమారుడు |
| 4. షిమ్యోను | — | ,, |
| 5. లేవి | — | ,, |
| 6. యూదా | — | ,, |
| 7. ఇశ్శాఖారు | — | ,, |
| 8. జెబులూను | — | ,, |
| 9. బెన్యామీను | — | ,, |
| 10. ఫరో | — | ఐగుప్తురాజు |
| 11. పోతిఫరో | — | రాజసంరక్షక సేనాధిపతి |
| 12. పోతిఫరో (భార్య) | — | హీరోయిన్ |
| 13. పానదాయకుడు | — | ఉద్యోగి |
| 14. భక్ష్యకారుడు | — | ,, |
| 15. 1వ భటుడు | — | సేవకుడు |
| 16. 2వ భటుడు | — | ,, |
| 17. 1 ఇశ్మాయేలీయుడు | — | గిలాదు దేశస్థుడు |
| 18. 2వ ,, | — | ,, |

# యోసేపు చరిత్ర

## ప్రథమాంకము

(స్థలము - ప్రార్థనా మందిరము. ప్రార్థనకు బిడ్డలతో తండ్రి యాకోబు ప్రవేశించి వారి వారి స్థానములలో ఆశీను లగుదురు.)

యా : దైవదత్తములైన పుత్రులారా! అనన్య బాహుబల సంపన్నుడు, తేజోమూర్తి, దయామయుండునగు, ఆ యెహోవా దేవుని అనుగ్రహమువలన మనము దీవించబడితిమి మీరు దైవభక్తిపరాయణులై దైవకార్యములందాశక్తి కలిగి నిత్యము ఆయనను ధ్యానించుచూ, సాతానుకు చోటివ్వక మీ హృదయములను పవిత్రముగా నుంచుకొని ఒకరియెడల ఒకరు అన్యోన్య ప్రేమగలిగి ఈర్ష్యాద్వేషములు మాని మీ జీవితములు పవిత్రముగా గడుపుడి మరియు....

సీ॥ ఆధారమేలేక అత్యంతనేర్పుతో
పుడమిని దొర్లించు పూజ్యుడెవడు?
మాయని కాంతిచే ప్రజ్వలించెడి సూర్య
చంద్రులన్ జేసిన స్వామి ఎవడు?
కాలగతులనెల్ల క్రమముగా నడిపించి
పవలు రాత్రులనేలు ప్రభుడెవండు?
మరకత మాణిక్యమణులను సృష్టించి
మహిలోన గుప్పిన మాన్యుడెవడు?

ఆ॥ రంగు రుచులనెల్ల రంగరించి భువిని
వింతగాను నొసగు విభుడెవండు
అట్టి శక్తిపరునిపట్టి సేవించిన
ఫలముగలదు మనకు పరమునందు.

ఆ పరాత్పరుడు అంత గొప్పగా సృష్టించి కాపాడుచుండ అయనకు విధేయులమై బ్రతుకుట మేలుకరము

రూ : (అందరిబదులు) పితృదేవా! అటులనే సృష్టికర్తయందు భక్తినిలిపి ఆయన సంకల్పమును గుర్తెరింగి ఆయన పాదపద్మములనంటి సద్గతికై సద్భక్తితో జీవితంబులు సాగించెదము.

(తండ్రి లోనికి నిష్క్రమించును)

యో : సోదరులారా! మన జనకుడు ఆ యెహోవా దేవునిగూర్చి చక్కని ఉపదేశమిచ్చియున్నారు.

షి : ఆయన దయామయుడు. ఆ సత్ప్రభు కటాక్ష వీక్షణంబులు మనపై లేకున్న మనము వట్టివారమేగదా!

యూ : అయ్యది నిక్కముగా సత్యంబు. మనము ఆయన కృపలేకున్న మన మనుగడ సాగించుట దుర్లభము.

రూ : అందుకే మన పితృదేవుడు ఆ పరాత్పరునిగూర్చి ఆయన క్రియలు, ఆయన అద్భుతములను గురించి అంతగొప్పగా ఉపదేశించియున్నారు

యో : (ప్రకాశముగా) అన్నలారా! గత రాత్రి నేనొక విచిత్రమైన కల గంటిని.

రూ : తమ్ముడా! ఏమని కలగంటివి. నీ కల సామాన్యమైయుండదుసుమా!

షి : లేదు సోదరా! కలలు కనుటలో వాటి భావములు విప్పుటలో అగ్రగాముడు.

లేవి : నిజమే! కొండెములు చెప్పుటలోను అగ్రగాముడే.

యూదా : ఛా!ఛా! మనలో అర్భకుడు. అందులో మన తండ్రిగారికి గారాలి సుతుడు. ఆయన సామాన్యమైన కలలు కనడుసుమా!

ఇశా : అబ్బో! బహుగా శ్లాఘించుచున్నారు. ఆయనగారు కనిన కల చెప్ప నీయక అడ్డుపలుకుట భావ్యముగాదు. చెప్పనీయుడి.

జెబు ఏదిసోదరా! నీ స్వప్నమందిరము.

రూ : నిజమే మనము అన్యాపదేశముగా పచించుచూ ఆయన స్వప్న స్వభావమును తెలుపకుండా అడ్డుకొట్టినాము. ఏదీ చెప్పు సోదరా!

యో : సోదరులారా! ఇదిగో నేను గనిన కల చెప్పెద. నాలకింపుడి.

సీ॥. కలగంటి వింతయొకలను నిన్నటిరాత్రి
వినుడి సోదరులార! వింతకలను
పొలములో మనమంత గలగలపనలను
కుప్పవేయగ వేగకూర్చుచుండ
నా పన, నిలబడ మీ పనలన్నియున్
సాష్టాంగపడి యెను సన్మనమున
రవిచంద్రు లిరువురు రయమున పద్నొకండు
నక్షత్రములుకూడి నమసులిడియె

ఆ॥ ఇట్టి కలను నేను ఏనాడు గనలేదు
వింత గలుగుచుండె నెంతగానొ!
దైవచిత్రమేమొ దరిగాన లేకను
దిగులుజెందుచుంటి దిగ్భ్రమమున.

రాత్రినుండి నా మనం బెంతయో తల్లడిల్లుచున్నది. భవిష్యత్తులో ఏమి జరుగనైయుండెనో ఆ పరమాత్మకే ఎరుక.

రూ : ఏమేమి చాల విచిత్రముగా నున్నదే ఎంత విడ్డూరముసుమా!

షిమ్యో : కాకేమిః ఆయన దైవాంశసంభూతుడాయె. ఇటువంటి కలలు ఎన్నోకనగలడు. మనలను మంత్రముగ్ధులను చేయగలడు.

యో : భ్రాతలారా! నే ననృతమాడుటలేదు. యదార్థముగా అవి నాకు కలిగిన స్వప్నము.

షి : మేమూ కంటూనేయున్నాము. రాజాధిరాజులై సింహాసన మెక్కినట్లు వందిమాగధులు స్తోత్రపాఠములు వల్లించినట్లు.

యూ : సోదరులారా! తండ్రిగారి వాత్సల్యము యీతనిపై నున్నందున ఈ విధముగా మనలను తమాషా చేయుచున్నాడు.

యో : సోదరులారా! లేదు లేదు. ఇది సాక్షాత్తు ఆ యెహోవాదేవుని సాక్షిగా నేను కనిన కలసుమా!

ఇశా : ఏమో నాకు నమ్మకము చాలకున్నది.

జెబు : మనలనేదో గారడీలో నడపనున్నట్లున్నాడు.

యో : భ్రాతలారా! నేను మిమ్ములను వంచించుటగాదు. నిక్కముగా గత రాత్రి నాకు కలిగిన స్వప్నమేగాని అన్యముకాదు.

రూ : అయినను ఈ సంగతి మన పితృదేవునికి విన్నవింతము. అదుగో నాన్నగారిచటికే వచ్చుచున్నారు. (తెరవైపు వీక్షించి).

యా : వత్సలారా! ఏమి మీ శంక. అందరూ ఏదో దీర్ఘాలోచనలో మునిగి నట్లున్నారు?

యూ : ఔను! పితాజీ! మా తమ్ముడు యోసేపు తానేదో కలకనియున్నా డట. అది వినగానే అందరూ సంభ్రమాశ్చర్యములో మునిగి యున్నారు.

యా : అటులనా? ఏమని కలకనెను?

ఆ॥ వాడు తెలివిగలిగి వర్ధిల్లుచుండెను
ఉదయకాంతివోలె నున్నతముగ
దైవమెంతగానొ దాక్షిణ్యమునుజూపి
సాకుచుండె నతని చల్లగాను

ఏదీ! అతని స్వప్నభావము.

రూ : తండ్రీ! ఆలకించుము.

గీ॥ సూర్యచంద్రబింబంబులు సూటిగాను
పదునొకండు తారలతోడ ప్రణుతులిడగ
అబ్బురంబున తానెంతొ ఉబ్బిపోయి
కోయుచుండెను మిక్కిలి కోతలెన్నొ.

యా : ఏమేమి? సూర్యచంద్రులు తనకు సాష్టాంగదండప్రణామములిడెనా? ఎంత ఆశ్చర్యము.

లేవి : పితృదేవా! యిది లోతైన అర్ధము గలగిన స్వప్నము.

రూ : కాకేమి! సూర్యచంద్రులనగా యీతని దృష్టిలో మన తల్లిదండ్రులుగా కాన్పించుచున్నది.

యూ : ఇంకేమి? ముందుముందు మనము ఆయనకు మ్రొక్కి సేవలు చేయవలెనన్నమాట.

లేవి : ఆహా! యీ స్వప్నభావము చాలా విచిత్రముగా నున్నదే

ఇశా : కాకేమి? ఇప్పటినుండే మనల నేలుబడి చేయుటకు పన్నాగములు పన్నుచున్నాడేమో!

యా : ఏమి నా తనయా! సూర్యచంద్రులనిన తల్లిదండ్రులమైన మే మిరువురమేగదా!

యో : పితాజీ! అన్యము నాకు తెలియదు. ఇది నేను కనిన కలమాత్రమని చెప్పుచున్నాను.

యా : యోసేపూ! నీవనిన నాకెంతో ప్రేమ. అది యింతయని చెప్పలేను. ఇప్పటికి నిన్ను క్షమించుచున్నాను. ఇటువంటి కలలు నీ మనసులోనే ఉంచుకొనవలెనుగాని అన్యులకు చెప్పి అపోహకలిగించకు.
(అందరు పకపక నవ్వెదరు. తండ్రి నిష్క్రమించును.)

యో : [ప్రక్కకువచ్చి-తనలోతాను] ఆహా! ఏమి యీ నా దురదృష్టము. కనిన కల ఎరుకపరచినందుకు వీరికింత కడుపుమంట. ఇదంతా ఆ యెహోవాదేవుని సంకల్పము. ఆయన చిత్తమేమైయున్నదో తెలియదు. తన బిడ్డలను రక్షించుటకు ఆయనెన్నో మార్గములు వెదకి మనల రక్షింపజూచును. తుదకు నా తండ్రిసైతము నా స్వప్నమునకు కోపించి నన్నే మందలించియున్నారు దైవ మేరీతి చేయనెంచెనో ముందు దినములగూర్చి చింతింపనేల? ఆ దేవదేవుడే కంటికి రెప్పవలె తన బిడ్డలను కాపాడక విడువడు.

రూ : సోదరా! మన యీ తర్కవితర్కములవలన నీ మనసు గాయపడినట్లున్నది. సర్వము మన మేలుకొరకే. ధైర్యమువహించియెహోవా దేవుని వేడుకొందము. మనోనిబ్బరము గలిగి ధైర్యముగానుండుము

యో : మంచిది. మా అగ్రజుని ఊరడింపులు నా కూరట గలిగించినవి దైవమును ధ్యానించి ముందుకరుగుట వివేకుని లక్షణము కానున్న దానికి వగచుట మంచిదికాదు.

(అందరూ నిష్క్రమించగా యాకోబు ప్రవేశించును.)

యా : (ప్రార్థించును-మోకాళ్ళూని) సృష్టిని సృష్టించి సకల జీవరాసులను సంరక్షించు సృష్టికర్తా నీకు స్తుతులు, స్తోత్రములు. మానవాళిని ప్రేమించి కంటికిరెప్పవలె కాపాడుచున్నావు. మా పితరుడగు అబ్రహామును ఆశీర్వదించి సకలైశ్వర్యములు సమకూర్చి నిధినిక్షేపములు గుప్తముచేసి పాలుతేనెలు ప్రవహించు కనాను దేశమునకు చేర్చియుంటిని. ఇసుకరేణువులకన్న మిన్నగా విస్తరింపజేసెదనన్న నీ వాగ్దానమును నిలిపి పెంపుజేయుచున్నావు, మీరు నా కొసంగిన ఈవు

అకై కృతజ్ఞుడను. బిడ్డలు మందలు మేపుకొనుటకు దూరదేశమునకు వెళ్ళియున్నారు. మమ్ములనందరిని ఆయురారోగ్యము లొసగి కాపాడ మని మిక్కిలిగా వేడుచున్నాను. (కండ్లు తెరచి) యోసేపూ! నా ముద్దులపట్టి ఎక్కడున్నావు?

యో ; ఏమి నాతండ్రీ! (అని ప్రవేశించి) మీ అనుంగుబిడ్డ తమ ఆజ్ఞను నిర్వర్తించుటకై వేచియున్నాడు. కాన సెలవిండు

యా : వత్సా! నీ పితృభక్తికి నేనెంతయో సంతసించుచున్నాను, ఒక ముఖ్య విషయము. నీ అన్నలు మందను మేపుటకై అరణ్యముల కరిగియున్నారు. వారు యిల్లు వదలి చాలాకాలమైనవి. వారి యోగ క్షేమములు తెలియకున్నవి గాన

ఆ॥ అడవికరిగినట్టి అన్నల జాడకై
శీఘ్రగతిని జనియు సేమమరసి
తిరిగిరమ్ము వత్స! తెలివిగా వర్తించి
కాననంబులందు కలిసికొనియు.

యో : నా తండ్రీ! మీ ఆజ్ఞను శిరసావహించి నా అన్నల జాడ తెలిసికొని అతి రయమున విచ్చేసి వారి క్షేమసమాచారములు మీ కెరింగించెద.

ఉ॥ కానలజొచ్చి అన్నలటు
గండములెన్నియొ దాటిపోవుచున్
మేను సుఖంబెఱుంగకను
మేదిని కాలముపెళ్ళబుచ్చగన్
నేనిట సౌఖ్యమొందుచును
నెమ్మినియుండుట భావ్యమా పితా!
నేనిపు డేగెదన్ తగిన
నెమ్మదిగూర్పగ వారిజాడకై

యా : కుమారా! వారే ప్రాంతమునకు పశువులను తరలించియున్నారో నీ వెరుంగుదువా?

యో : లేదు పితాజీ! నేనా విషయమావంతయు నెరుంగనైతిని.

యా : అయిన నీవు వారిజాడ నెట్లు కనుగొందువు?

యో : తమవద్ద వారి వలస కార్యక్రమమును సంగ్రహించి తద్వారా వారి జాడకై అన్వేషింప నుద్యుక్తుడనైతిని.

యా : మంచిది తనయా! నీ సమయోచిత సమాధానమునకు ముగ్ధుడనైతిని. ఇప్పుడు నాకు నమ్మకము కుదిరినది. తప్పక వారి జాడ కనుగొని, తిరిగిరాగలవు.

యో : ఔను నాతండ్రీ! ముందువెనుకలు ఆలోచింపకుండా ఏ కార్యమును సఫలీకృతము చేయలేము. విషయగ్రహణము కలిగినపుడే ఆ పనుల సాధ్యాసాధ్యములు తేల్చగలము.

యా : మంచిది. అయిన వినుము. వారు షెకేములో మందలు మేపుటకు వెళ్ళి చాలా కాలమైనది. వారి యోగక్షేమములు తెలియకున్నవి. అవశ్యమచటకేగి వారి యోగక్షేమములు తెలిసికొని ఆ సమాచారము నా కందించుము.

యో : అటులనే యొనర్చెద తండ్రీ! ఇప్పుడే షెకేమునకు బైలుదేరి కార్యోన్ముఖుడనయ్యెద.

(అని బయలుదేరును).

(తండ్రి వేరొకద్వారమున తానొక ద్వారమున లోనికి ప్రవేశించ వలెను. యోసేపు వెంటనే స్టేజిమీదకు వచ్చి అరణ్యములో వారి జాడకై వెదికినట్లు నటించి)

యో : (అటు యిటు తేరిపారజూచి) అరే! నా సోదరుల జాడ యిక్కడె క్కడో తెలియకున్నది. వారు యిచటనుండి మరెక్కడికో పోయి ఉండవచ్చును. ఎక్కడికి వెళ్ళుదురబ్బా! (అని ఆలోచించి) ఆ.... ఆ.... బోధపడినది! ఇక్కడ గొర్రెలకు మేత నిండుకొన్నది. అందు వలన వేరొక చోటికి తరలియుండవచ్చును. ఔను! దోతానులో మంచి మేతయున్నదని విన్నాను. బహుశా వారక్కడకు వెళ్ళిఉండవచ్చును అయినను అక్కడికి వెళ్ళెదను. (అని అటు యిటు తిరిగిచూడగా అన్నలు వేరొకప్రక్క కన్పించగా వారి వైపుకు తిరుగును.)

రూ : (అతని తనికి గమనించి) ఆహా! ఎవరబ్బా జనసంచారములేని యీ కీకారణ్యములో ఎవరో ఎందుకో వచ్చుచున్నారు. ఆ కాన్పించునది వ్యక్తియేనా? ఔనౌను అతడు మానవమాత్రుడే. నిజముగా నాతండు మనవైపునకే ఏతెంచుచున్నాడు.

ఉ॥ చక్కని ఛత్రవాడు మన
చాయలకే చనుదెంచుచుండె వా
డెక్కడివాడొగాని! మన
మెన్నగజాలని అందగాడహో
అక్కజ మాతడీయెడకు
నబ్బురమొందగ వచ్చుచుండె నే
డిక్కులు చూడకుండగను
తిన్నగవచ్చుట వింతయే సుమీ!

షి : సోదరా! ఆతడెవ్వరోకాదు. మన తండ్రిగారి ముద్దులపట్టి. నే జెప్పెద విను.

ఆ॥ నిలువుటంగిజూడ నిజముగా యోసేపు
తండ్రి పంపియుండ తరలెనతడు
మంచిచెడ్డలరసి మరలివెళ్ళగ తాను
వచ్చుచుండె నతడు ఖచ్చితముగ

లేవి : ఔనౌను! ఆ పోలికలనుబట్టి చూడగా నిక్కముగా నాతండు మన తండ్రి గారాలసుతుండె!

యూ : ఓహో! యిప్పుడు ద్యోతకమైనది. మీరు చెప్పినది అక్షరాల నిజము

ఇశా : తప్పక అతడేగాని, ఎందునిమిత్త మాతడు మనకడకువచనుదెంచుట?

జెబు : తినియున్నది వంటబట్టక షికారుకై వెడలియుండవచ్చును. మన కక్ష తీర్చుకొనుటకు యిదే మనకు మిక్కిలి అనుకూల సమయము,

షి : భేష్! నాకును అదే భావము కలుగుచున్నది. ఇది మంచి అవకాశము.

లేవి : ఈ సమయము మనము జారవిడువరాదు. కీలెరెంగి వాతపెట్టవలెను

రూ : అయిన అతనిని ఏమి చేయుదమని మీ ఉద్దేశ్యము?

యూ : ఈతనిని చంపి అతని అంగీని రక్తముతో తడిపి దుష్టమృగములు తమ్ముని వధించెనని తండ్రికి చెప్పుదము. తండ్రి తప్పక నమ్మగలడు.

షి : సెహభాష్! నిజమే తప్పక మన తండ్రి నమ్మగలడు. ఈ పథకము నకు మించిన పథకము మరొకటి లేదు.

రూ : సోదరులారా! అతనిపై ద్వేషము ఎవరికి లేకపోలేదు. గాని నర హత్య దేవుని దృష్టిలో మహాపాపము.

ఇశా : ఈ నీతులకేమిగాని "ఆలస్యం అమృతం విషం" అన్నారు పెద్దలు అవశ్య మా విధముగా ఆతనిని వధించి మన పగ చల్లార్చుకొనుట మంచిది.

రూ : అయినా తమ్ములారా! ఈతడు మనకేమి అపకారము చేసెనని మీ బాధ

యూ : వేయకపోవడమేమిటి? వీడు మనతో తిరుగుతూ మనమీద ఎన్నో చాడీలు చెప్పి మనలను శిక్షింపజేసినాడు.

లేవి : ఆతడు మనతో తినుచు త్రాగుచూ తీరని అపచారములే చేసి యున్నాడు కాదందురా?

షిమి : ఈతడనిన నా కసలేగిట్టదు గారాముగా పెరుగుచు తిండివేరే, వేష ధారణ వేరే. చిత్రవిచిత్రమైన నిలువుటంగీలుధరించి మనలను వెక్కి రించని దినములేదు.

జెబు : మనము ఎండనక, వాననక కష్టించి చెమటోడ్చి మందలను మేపి ఆస్తులను పెంపుజేయగా ఈతడు రాచబిడ్డవోలె తిని మత్తిలి మన పైన కోపబాణములు ఎక్కుపెట్టించియున్నాడు.

యూ : (రూబేనువైపు తిరిగి) నీ కాతనిపై ఎంతకక్షయున్నను నీవు సహనము వహించుట నాకు బోధపడకున్నది. మాలో జ్యేష్ఠుడవు, ధర్మాధర్మంబుల నెరింగినవాడవు. నీమాటలేనిదే ఒక్క అడుగు ముందుకు వేయము.

లేవి ; నీ యూహలకేమిగాని సమయము మించిపోవుచున్నది, కానిమ్ము.

షిమి : మంచిచెడులను యోచింపక ఆపదలు నెత్తిపై కెక్కించుకొనుట కొరగానిపని. ఇప్పుడు మించినదిలేదు. బాగా ఆలోచించండి.

లేవి : అగ్రజా! మా యీ సమస్యను తేల్చగల దిట్టవునీవే. అవశ్యము సెలవిమ్ము.

రూ : ఔనుగాని సోదరా! మీ తలంపులు నాకు తలవంపులు కలిగించుచున్నవి. మనలో మనకు ఎన్నో కక్షలుండవచ్చును. పగతీర్చుకొనుట మనవంతుకాదు. పగతీర్చుకొనుట ఆయనవంతు. ఎట్లనగా

సీ॥ నరహత్యకూడదు నరునకు పుడమిలో
దైవమిచ్చినఆజ్ఞ తమ్ములార!
ఉత్తరించగలము చిత్తమొచ్చినరీతి
మానవశిరసులన్ మహిని మనము
తిరిగిపోయగలమా? స్థిరముగా ఊపిరి
మరణించియున్నట్టి మానవునకు
దైవసృష్టి నటుల తరుగుట తగదోయి
బుద్ధ్యభిప్రాయంపు పుడమి ప్రజను

ఆ॥ తీయగలముగాని ధ్వరతన్ తలలను
పాపఫలిత మెట్లు బాపగలము?
బుద్ధిగలిగి మనము పుడమిని మెలగుట
దైవచిత్తమోయి ధరణియందు.

కాన దైవచిత్తానుసారముగా మెలగుట తగినపని. అంతియేగాని హత్యలు మెచ్చదగినవికావు.

షి : అయిన మీ సలహా? మీ సలహానుబట్టియే సాగిపోయెదము.

లేవి : ఔను సోదరా! మేలెంచి కీడెంచమన్నారు పెద్దలు. ముందు పరిణమించబోవు పరిణామముల నూహించి తగు రీతి సలహానొసంగ వీజ్ఞప్తి.

యూ : పెద్దవాడవు. మా మనసుల నలరించినవాడవు. ఎట్టి కార్యమునందైననూ ఘటనాఘటన సమర్ధుడవు. నీ సలహాకు తిరుగులేదు అవశ్యము సెలవిమ్ము.

రూ : సోదరులారా! నా మనసునకేమియు పాలుపోవుటలేదు. మీరే యోచించండి.

ఇశా : సోదరా! ముందే మామాట కాదంటివి. దీనికి తరుణోపాయమెద్దియో బాగుగయోచించి చెప్పుట మీ ధర్మము.

జెబు : ప్రాణాపాయములేని తరుణోపాయమెద్దియో యోచించి వాక్రుచ్చుము

రూ : అయిన తెలిపెద వినుడి.

అం : అంతకన్న మాకు కావలసినదేమున్నది. అవశ్యము సెలవిండు. మీ ఆజ్ఞానువర్తులమై మెలంగెదము.

రూ : అట్లయిన అతనిని చంపకుండా అతని అంగీని తీసి ఆ పాడుపడిన గుంటలోపడ త్రోయండి.

లేవి : అతడు నీటమునిగి చనిపోయిన హత్యచేసినట్లేగదా!

రూ : మీకా సందేహమువలదు. ఆ కనుపించుగుంటలో నీరులేదు. లోతు కలిగి ఎండియున్నది.

షి : అట్లయిన మంచిది. అయితే అంగీని తొలగించవలసిన కారణము?

రూ : అంగీని రక్తసిక్తముచేసి మన తండ్రికి పంపనెంచితిరిగదా!

లేవి : అట్లయిన మంచిది. గొర్రెను చంపి రక్తము అంగీకి పులిమి తండ్రికి పంపుదము.

షి : మంచిఆలోచన అట్లు జరిపిన మన జనకుడు యీ హత్యను సంశయించుట కాస్కారముండదు. అప్పుడు మనమీద అనుమానమే ఉండదు.

అం : మంచిది. ఈ కార్యమును అలాగుననే చేయుదుము. (రూబేను లోనికి వెళ్ళును.)

యో : (ఇంతలో యోసేపు సమీపించి అమితానందముతో) అన్నలారా! మీకు నమస్కారములు, మన తండ్రిగారినుండి శుభాశీస్సులు. మీరు

మన నెలవునువీడి చాలాకాలమైనది. పితామహులు మీ యోగక్షేమములు తెలియనందున బహుగా విచారపడి మీ యోగక్షేమముల నరసిరమ్మని పంపించియున్నారు. అందరూ క్షేమమేనా?

షిమి : ఓహో అలాగా! ఇక్కడ జరుగు తోటుపాట్లనుగూర్చి మామీద పితూరీలు చెప్పవుగదా!

యో : సోదరా! ఎందుకు మీరు నన్నావిధంగా అపార్థముచేసికొనియున్నారు

లేవి : ఓహో! నీసంగతి మే మెరుగమా! అయినదానికి కానిదానికి తండ్రిగారికి మామీద నూరిపోసి నీవు మమ్ములను హింసించలేదా?

యో : లేదు లేదు. సత్యమును మాత్రము వచించియుంటిని.

ఇశా : ఆ సంగతి ఎవ్వరెరుంగనిది. ఆయన మెప్పుకోసం ఏవో కల్పించి మామీద పులిమెదవు.

జెబు : మేము నీ సంగతులన్నియు కాచివడపోసియున్నాము, ఇక చాలు నీ నయగార పలుకులు.

యో : సోదరులారా!నేనింతగా ప్రయాసపడి మీకడ కేతెంచగా నన్నిట్లు తూలనాడుట పాడిగాదు.

షి : అనవసర ప్రసంగములాపుము. నీయెడల పితాజీకున్న ప్రత్యేకాభిమానము మేమెరుంగనిదికాదు నీ నీటు, నీగోటు మాకంటే ఎన్నిరెట్లు గొప్పదో గ్రహించియేయున్నాము.

యో : మీరనుకున్నంత త్రేలికగా మన పితాజీ మిమ్ములను కించపరచి చూడలేదే. సమభావముతో వీక్షించినారుగాని భేదభావము చూపలేదే!

లేవి : చూపకేమి? నీవు ఆయన మూవునవుంటే మేము దాపునకైనను చేరు టకర్హత లేకపోయె.

ఇశా : మన తండ్రికి నీమూలముననే మా అందరి మీద పెడబుద్ధి ఏర్పడి నది.

యో : సోదరులారా! మీరు కన్నతండ్రిపైననే నీలాపనిందలు వేయుచు న్నారు. అయ్యది మీకు తగనిపని.

షిమి : (కోపమున) నోర్మూయి. అతిగా వాగకు. లేవీ! ఈతని అంగీని విప్పివేయండి.

యో : ఆదంతా నీ కనవసరము. (ఒడుపుగా అంగీని విప్పి చేతులు వెనుకకు కట్టి గుంటలో పడద్రోయుదురు)

యో : (విలపించుచూ) హే పరాత్పరా! దయానిధీ నా సోదరులు యింత నీచమునకు పాల్పడుదురని నేను కలనైనా తలంచి ఎరుగను. యెహోవాదేవా! నీవే నాకు దిక్కు. శిష్టరక్షకుడవు.

సీ॥ దేశమేవిడిచియు దీనుడై తిరిగెడి
అన్నల సుఖమును నరయరాగ
నిందలుమోపియు నీచముగా బల్కి
గ్రుక్కెడు నీరీయ నక్కనాకు
సత్యపథమునందు సాగెడి బుధులకు
తప్పవు చిక్కులు ధరణియందు
అన్నలు కక్షతో నన్నిట త్రోసిరి
దయను బరుపలేదు తమ్ముడనియు

గీ॥ ఎవరు రక్షింపగలరింక యిమ్మహిని
దైవమేదిక్కునాకు నీ తరుణమందు
వేడుకొందును దైవమున్ వినయమతిని
నన్ను రక్షించికాపాడ సన్నుతుండు.

పాట

ఏదీ గతినాకు-దైవమా-ఏదీ గతినాకు

1] అన్నల క్షేమము-నరయగరాగ నన్నిట చెరలో
నిలిపిరిదేవ ॥ఏదీ॥

2] పరమదయానిధీ-బ్రోవుమునన్ను-కరుణరహితపు-
కారణమునకు ॥ఏదీ॥

3] మోసమెరుంగని-దాసుని నన్నిల
ఒంటిగ విడిచియుండిరి దేవ ॥ఏదీ॥

సకలజన సంరక్షా! యెహోవాదేవా! నీవే నాకు దిక్కు. నాకు యీ దుర్గతిబాపి నన్ను నా తండ్రికడకు జేర్చుము, ముందుచూపులేక నా సోదరులు క్రౌర్యమువహించి నన్నిపు డధోగతివాల్జేసిరి. నీ దక్షిణ హస్తము నాపై చాపి నన్ను రక్షింపుము.

(అని తూలుచు ప్రక్కన పడియుండును.)

షి : లేవే! ఇశ్శాఖారు, జెబులూను లెండి. భోజనమునకు వేళైనది.
అదిగో ఆ కనబడు చలమువద్ద మూటలువిప్పి భుజింతము రండు.

లే : మంచిది సోదరా! అటులనే చేయుదము.

(అని అందరు భుజించుట కుపక్రమించెదరు.)

షిమి : (భోజనము చేయుచూ దూర ప్రదేశమువైపు చూచి) అదిగో! ఆ సుదూరమున కాన్పించు వ్యక్తులు ఎవరైయుండవచ్చును?

జెబు : వారు ఏదేశమునకు చెందినవారో! బహుశా వర్తకులై యుండవచ్చును.

ఇశా : సోదరా! నీ యూహ ప్రకారము వారు వర్తకులై యుండవచ్చును. అవిగో ఒంటెలు. అవి వ్యాపారమునకు చిహ్నములు. (అంతా ఊహగా చెప్పడం)

షిమి : వారితో పనివున్నది. వారు దగ్గరకు రానేవచ్చారు. త్వరగా భోజనము ముగించి లేవండి.

అంద : అలాగేనని (లేచి ఎదురేగెదరు)

యూ : ఓయీ వర్తకులారా! మీ రెవరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు?

1 ఇ : మేమ్ ఇష్మాయేలీయులం. గిలాద్ సేఆతాహుం. మాది యాపారం. మాకీ యాపారం చేస్తాం.

షిమి : అయితే ఎక్కడికి వెళ్ళుచున్నారు?

2 ఇ : ఐగుప్తు దేశాన్కి సర్కు రవాణా చేస్తాం.

ఇశా : ఏమేమి అమ్ముతారు?

1 ఇ : మాకి సుగంధద్రవ్యమ్, మస్తకి వగైరా యాపారం చేస్తామ్.

జెబు : ఇప్పుడేమి రవాణా చేయుచున్నారు?

2 ఇ : గుగ్గిలం, మస్తకి, బోళం విర్వాగా అమ్ముతాం.

లేవి : అయితే ఏమాత్రం లాభముంటుంది. ఎంతకాలము అక్కడ గడుపుతారు?

1 ఇ : సమయాసమయం. అది ఎవరు చెప్తారుసాబ్. జల్ది జల్ది అమ్ముడుపోతే తొందరగా ఎల్తాం.

2 ఇ : ఐసా కుదర్కపోతే రెండు మూడు మాసాల్ పట్టవచ్చు. ఏదో పొట్టకూటికోసంపిల్లజెల్ల యిల్లువాక్లి వదలి వెల్తాం. మీకి ఏమికావాలి? గుగ్గిలమ్, మస్తకి ఔర్ బోళము కావాలిభాయ్. మాది మంచిసరుకు. సరుకుచూచి కొనండిభాయ్.

షిమి ఇష్మాయేలీయులారా! మీకు మేమొక మంచి బేరము ఏర్పాటుచేసియున్నాము.

లేవి : అంగాతేని మాకు మీ సరుకుతో పనిలేమ.

1 ఇ : అచ్చా! బోలో భాయి ఏ క్యాహై?

షిమి : ఏమీలేదు. ఇక్కడొక మంచి కుర్రవాడున్నాడు. అతడు మీకు అన్ని విధాల పనికివస్తాడు. ఎవరో గుంటలో పడద్రోసి వెళ్ళియున్నారు.

లేవి : మేమే ఉంచుకొనెడివారముగాని మందలను మేపుకొనుటకు కనాను దేశమునుండి వచ్చినాము.

2 ఇ . మీకి మంచి సాయంగదా! ఉంచుకోండి.

జెబు : అయితే అలా చేయటానికి మావద్ద తినుబండారములు నిండుకొన్నవి మేము యింకొంతకాలమునకుగాని వెళ్ళుటకు వీలులేదు.

1 ఇ : అచ్చా! అది తంటా బేరంకాదుగదా భాయ్!

షిమి : ఛా! ఛా! అటువంటిదేమీకాదు. నిరభ్యంతరముగా ఖరీదు చేయ వచ్చును.

2 ఇ : చెప్పుభాయి! ఎంతలోఉంది బేరం. ఐసా పైసాగాబోల్?

2 ఇ : మాకి వట్టిమాటల్ పన్కిరావ్. హాత్‌మే పైసాదాల్నా, బచ్చాకో లేజానా? బోల్ భాయ్! కెత్తాదామ్?

లేవి : (వారిలో వారు గుజగుజలాడుకొని) నలుబది తులాల వెండి కిచ్చుటకు సంసిద్ధం.

1 ఇ : నై భాయ్! అంతచెప్తే ఎలాకొంటాం. కరకట్ బేరం బోలో.

షిమి : మీకెంతకు కావలయునో చెప్పండి?

1 ఇ : క్యాభాయ్ తుమ్‌పూచో [అని రెండవవాని నడగగా]

2 ఇ : నై నై తుమ్‌పూచో. తుమ్ బడా ఆద్మీహై. పరవానై పూచో.

1 ఇ : అచ్చా! బీస్ తుంమ్‌దేతుమ్

జె : బీస్ అంటే?

2 ఇ : బీస్ అంటే యిర్వై తులముల్ భాయ్

ఇశా : అంతేనా! చాకులాంటి కుర్రవాడు. మీకు బోలెడంత లాభమయిచ్చి పోతాడు.

1 ఇ : మాకు అంత్కిమించి ధరపల్కాదు భాయ్. (అని లేస్తాడు)

షిమి : సరే మిమ్ములను బలవంత పెట్టము. అంతవరకు యివ్వండి.

2 ఇ : అచ్ఛా అట్లా అన్నారు. మాకి యిక నలిలేదు.

1 ఇ : (20 తులములు ఎంచి) ఇదో భాయ్ పైసా.

షిమి : పైకము తీసికొని యోసేపుని అప్పగించును-

1, 2 ఇ : అవ్ బచ్చా! చాలా సైము అయ్యింది. ఆ....ఆ....చల్తమ్. ఆ. (అని లోనికి వెళ్తారు).

రూ : (వేరొక ద్వారమున ప్రవేశించును) సోదరులారా! మన తమ్ముడు యోసేపు ఎక్కడ?

అం : మౌనము వహిస్తారు.

రూ : అయ్యో శాపగ్రస్తులారా! రక్తము పంచుకొనిపుట్టిన తమ్ముని ఎంత అన్యాయము చేసినారు. మన తండ్రికి నేను ఏమని చెప్పను? (గద్గద స్వరంతో) అయ్యో తమ్ముడా! యోసేపు ఎక్కడున్నావురా?

ఉ॥ ఏమని చెప్పెదన్ పితకు
నివ్విధిగూర్చియు దేవదేవుడా!
ఏమరియుండగన్ జరిగె
నిత్తరినెంతయు ఘోరమీయెడన్
పామరజాతివోలె బహు
పాపము జేసిన నీచులార! ఈ
సీమకు నొంటిగా చనిన
చెన్నుని నెచ్చట చంపినారురా

(అని యేడ్చును)

తెర జారును.



## -: ద్వితీయాంకము :-

(ఇశ్మాయేలీయులు యోసేపుని తీసికొని రాజసంరక్షకుడగు పోతిఫరో యొద్దకు తీసికొనివత్తురు. ఆయన ఆసీనులై యుండగా)

ఇస్మాయేలీయులు ఇరువురు : సలామ్‌లేకో మహరాజ్ (అనినమస్కరిస్తారు)

పో ఫ. : నమస్కారము. మంచిది. ఇశ్మాయేలీయులారా ఎలా యున్నది మీ వ్యాపారము?

1 ఇ : మహరాజ్ ఆప్కి మెహర్బానిసే, మాది యాపారం అచ్ఛాహై.

2 ఇ. : తమ్కి దర్శనం శేయటాన్కి వచ్చాంసాబ్

పోతి : మంచిది. ఎవరీకుర్రవాడు. మంచి స్ఫురద్రూపిగా యున్నాడు

1 ఇ : ఆజే మహరాజ్! మాదిమాట-మీకి సెప్టాన్కి వచ్చాం.

2 ఇ : ఏ బచ్చా బహుత్ అచ్ఛాహై! అందమైనవాడు. తెల్విగలవాడు.

పోతి : ఔనౌను. ఈతనివాటమే తెలియజేయుచున్నది. మంచి విజ్ఞాన సంపన్నునిగా కాన్పించుచున్నాడు. ఎవరివాడో? ఎక్కడివాడో?

1 ఇ : అవ్‌కి పిల్లాజల్లానై ఆది మాకు తెల్సుసాబ్. అచ్ఛాగా ఉంటదని తెచ్చాము సాబ్.

పోతి : ఔనౌను. బిడ్డలులేనికొరత మీ రెరిగినదేగదా!

2 ఇ : ఔన్ మహరాజ్. ఆప్‌కి బాత్ మాకితెల్సు. ఏ బచ్చా అచ్చాహై.

1 ఇ : ఆప్‌కా ఘర్‌మే బహుత్ కామ్ కర్నేవాలాహై.

2 ఇ : బడా నమ్మకంసాబ్, అబద్ధంలేదు. పోకిరియాసం లేదు. అచ్చా బచ్చాహై.

1 ఇ : మాకి అన్నీ తెల్సుసాబ్. ఏ బచ్చాకో ఘర్‌మే డాలేతో సబ్‌కోసబ్ కామ్‌కరేగా.

పోతి : ఔను నేనూ అదే యోచించుచున్నాను. మీకు ఏమి కావాలి?

2 ఇ : మీకి అంతా తెల్సుసాబ్. మీదిదయ మాది ప్రాప్తం.

పోతి : ఔనయ్యా! అదే చెప్పండి. నేను చెప్పుట మంచిదికాదుసుమా!

1 ఇ : మీది మాటగా ఎంతోకొంత దయచేయిసాబ్. ఆప్‌కి అంతా తెల్సు.

పోతి : ఇదిగో! ఈ నూరుతులాలవెండి తీసికొని ఈ కుర్రవానిని మాఇంటివానిని చేయండి.

1 ఇ : ఏ బచ్చాకా పాదమ్ అచ్చాసాబ్

2 ఇ : ఆప్‌కాఘర్‌మే పాదంమోపితే మీకి బాగా కల్సివస్తదిసాబ్.

పోతి : అదంతా మా అదృష్టము. కానివ్వండి.

4)

1 ఇ : ఏ నైసాబ్! ఏ బేకారి ఆద్మినై. చాలామంది అడ్గారుసాబ్. మాకి కావాలి మాకి కావాలని

2 ఇ : మాకి నచ్చలేదుసాబ్. ఏ బచ్చాకో పల్లెటూరి గంవ్వార్‌కి దేనేకి మనసు ఒప్పలేదుసాబ్,

పోతి : ఇదిగో పైకము. (అని నూరు తులములిచ్చును.)
( యువకుని పోతిఫరోకు అప్పగింతురు )

1 ఇ : అచ్చా సాబ్! మాకి పైసా బస్‌హోతా. ఆప్‌కి మంచి కలగాలి.

2 ఇ : ఆఁ ఆఁ సచ్చీ బోల్తాహుం పరవానై బచ్చా చలో. ఏ మహరాజ్‌కా ఘర్‌కో (నిష్క్రమించును.)
(పోతిఫరో-యోసేపు స్టేజిమీద నిలిచి)

పోతి : ఓయీ యువకా! నీవు ఎవ్వరివాడవు? ఎక్కడివాడవు?

యో : చిత్తము నేను కనాను దేశీయుడను. నాతల్లిలేదు తండ్రి వృద్ధుడు. దారితప్పి దోతాను చేరితిని

పోతి : మరి ఈ ఇశ్మాయేలీయు లెచట తటస్థపడిరి.

యో : దోతానులో దుర్మార్గులచే అమ్మబడితిని. నా దురదృష్టమునకు ఏమని పలుకను. విధికృతము ఆ దేవదేవుడే అన్నివిధముల కాపాడగలడను దృఢనిశ్చయముతో మానసికబాధను దిగమ్రింగితిని.

పో ఫ : మరినీకు మా కడ నుండుటకేమైనా అభ్యంతరమా?

యో : మహాప్రభూ! నేనెక్కడ ఉండవలయునో దైవము నన్నక్కడికే పంపి యున్నాడని బహుగా మురియుచున్నాను.

పోఫ : అంతేగాని నీ దురదృష్టమునకు దుఃఖపిల్లుటలేదుగదా!

యో : లేదు ప్రభూ! మీ దాపున చేర్చినందుకు ఆ యెహోవా దేవునికి కృతజ్ఞతా స్తుతులు చెల్లించుచున్నాను.

పోఫ : ఎందువలన మామీద నీకంత నమ్మకము కుదిరినది?

యో : మీరు రాజసంరక్షక శాఖాధిపతులు, ఇంతకంటే మహద్భాగ్య నాకేమున్నది, అందుకే సంతృప్తుడనై ఆ దేవదేవునికి మీకు నా నమస్సులర్పించుచున్నాను..

పోఫ : అయితే గతాన్ని విస్మరించి సంతృప్తిచెందియున్నావన్నమాట.

యో : మహాప్రభూ! ఈ జీవితములు బుద్బుధప్రాయములు. ఈనాడు యింట, రేపు మంటిలో. ఈ అల్పమైన జీవితమునకై మన మెంతగనో విర్రవీగుట కద్దు. వినండి నా మనవి.

ఉ॥ అద్భుతమైన సృష్టి పర
మాత్ముడు లీలగ సృష్టిజేసి ఈ
అద్భుత సృష్టికై విభుడు
హర్ష ముజెందెను మిక్కుటంబుగన్
బుద్బుధప్రాయులైన ప్రజ
మోదముజెందుట మిథ్యయేసుమీ
బుద్బుధమైన జీవితము
ముప్పునుగూర్చును విర్రవీగినన్.

అందువలన అణుకువగలిగి పెద్దల దీవెనలు పొందిన పరమాత్మయే కాపాడగలడు. అందులకే మీవంటి యోగ్యుల ఆదరణ చేరుట.

పోఫ : ఐహా చక్కగా వచించితివి. నా మనసమందానందంబు నొందు చున్నది. వయసున పిన్నవైనను సూక్తులు గొప్పగా వచించితివి.

యో : మహాప్రభూ! మానవునకు తృప్తియేలేకున్న సుఖమేదక్కదు. ఉన్న దానితో సంతృప్తిజెందు వానికంతయు సుఖమయమే.

పోఫ : అద్భుతము. మహాద్భుతము. ఎంత చక్కగా వచించితివి. ఇంతటి పరిజ్ఞానము గలిగిన యోగ్యుడు మాకు దక్కుట నిజముగా మా ఆదృష్టము.

గీ॥ తల్లిదండ్రుల బాసియు దారిలేక
దిగులుజెందుటమానిన దీధితుండ
మెచ్చినాడను నిన్ను నే హెచ్చుగాను
భయములేకను మా యింట మసలుమోయి.

యో : దయానిధీ! మీ ఔదార్యమునకు వినమ్రుడనై మ్రొక్కులిడెదను.

ఆ॥ మాతృమూర్తివోలె మక్కువచూపించి
ఆదరించియుంటి రమితముగను
కన్నవారికన్న మిన్నగా కొలిచెద
ఏడుగడగమిమ్ము యిమ్మహిని.

పోఫ : యువకుడా! సౌందర్యరాశీ!

గీ॥ హృదయముప్పొంగె నినుజూడ హెచ్చుగాను
సూక్తులెన్నియొ బలుకంగ యుక్తిగాను
మనసు నిబ్బరముగలిగె వినయశీల
సర్వమప్పగించెద యింట సాగిరమ్ము.

నవ్యభావాల యువకిశోరమా! నాయింట నీకే లోటు కలుగనీయను. స్వామిభక్తిగలిగి సర్వులు మెచ్చునటుల నీ మనుగడ సాగించుము.

యో : ప్రభువర్యా! అటులనే తమ అజ్ఞానువర్తనుడనై సర్వకార్యములు మీ మనఃబొప్పునటుల నిర్వర్తించెదను.

(ఇరువురులోనికి వెళ్ళి రెండవ ద్వారమున వచ్చుసరికి పోతిఫరో భార్య ఆశీనురాలై యుండవలెను. అంతట వారివురు రాగా లేచి నిల బడును.)

భార్య : (ఆ యువకునిచూచి) నాథా! ఎవరీ చక్కని చుక్కలరేడు.

పోతి : లావణ్యవతీ. నేను రాచకార్యములందు నిమగ్నమైయుండుటచే మన యింటి కార్యనిర్వహణా కార్యక్రమములుకుంటుపడుచున్నవి.అందు వలన యీ యువకుడు మనకు అన్నివిధముల తగినవాడని అతని వైఖరినిబట్టి మనయింట నుండుటకు కొనుగోలుచేసితిని.

భార్య : (లోలోపల మురిసి) మంచికార్యము చేసినారు. ఈ దినము మనకు మహాసుదినము.

ఆ॥ అందగాడు చూడ నపురూపమైనట్టి
గుణగణంబులున్న కోవిదుండు
లోటుదీర్చినారు సూటిగా వర్తించి
వెలుగురేఖ నింట నిలిపినేడు

యో : మాతా! (అని సంబోధించగా భార్య చలించును.) మీకు నా నమస్కృతులు. మీ దంపతు లిరువురు నన్నింతగా ఆదరించుటచే నా మనం బుల్లసిల్లుచున్నది.

భార్య : నాధా! యీతడెచ్చటివాడు? ఏ దేశవాసి! మాతాపితలు లేరా?

పోతి : ఈతడు యికనుండి మనయింటనే ఉండును గాన అడిగి తెలుసుకొనవచ్చును. అయితే యీతనిని చూడగానే వర్షమువెలిసిన ప్రాంతములో వజ్రము దొరికినట్లు సంబరపడి ఈతనిని ఖరీదు చేసితిని.

భార్య : చాల మంచిపనిచేసియున్నారు. మీ విద్యుక్తధర్మమునకు ఏ లోటు కలుగదు, అన్నికార్యములు యీతడే చక్కబెట్టగలడు?

పోతి : సతీమణీ? నేనొక విషయము చెప్పెద నాలకించుము.

ఉ॥ బానిసవానివోలెగని
బాధలుపెట్టకు సత్యభాషిణీ!
మానసముల్లసిల్ల నిను
మాతగనెంచియు సేవజేయగన్
వీనిని ప్రేమతో గనుచు
మేలునుబొందుము మాతృమూర్తిగా
మానిత సద్గుణంపు సతి
మన్ననబొందుము పృధ్విమెచ్చగన్.

భార్య : ప్రాణప్రియా! మీరు నుడివినట్లు మెలగి మనలను అదృష్టదేవత వరించునటుల జేసెద.

సీ॥ బిడ్డలులేక నే బెంగతో దురపిల్ల
దైవమే సమకూర్చె తగిన వసరు
గడ్డుగాకాలంబు గడుపుచున్న మనకు
తోడుగా యీబిడ్డ దొరికెనేడు
సంతృప్తి జెందితి చక్కని జేడును
చూచినకడనుండి శుభమటంచు
లోటుగలుగనీను నీటుగా వానిని
తీర్చిదిద్దగలను దిగులుమాని

ఆ॥ అడ్డులేదు మీకు నావంతయునుగూడ
బ్రతుకుదినములందు ప్రాణనాథ
శంకవీడి మనుడి సత్కీర్తిగూర్చెద
పనులు చక్కబెట్టి ప్రగతిగనగ.

కాన మీరు మీ రాచకార్యములను నిశ్చింతగా నెరవేర్చుకొనవచ్చును.

పోతి : సతీమణీ! చక్కగా వాక్రుచ్చితివి. సుతులు లేనివారికి గతులు లేవన్నారు పెద్దలు. ఆ లోటును ఈ మనబిడ్డ తీర్చగలడు. ఓయీ యోసేపు ఈ దినమునుండి ఈ ఇంటి కార్యములన్నియు నీచేతిమీదుగా జరగవలెను, ఇవిగో తాళములు.

యో : (వినమ్రుడై నమస్కరించి) మాతాపితలారా! నేను ధన్యుడనైతిని. బానిసగాకాక యింటిబిడ్డవోలె పరామర్శింపనెంచిన మీ ఔదార్యమునకు కృతజ్ఞతాసుమాంజలులు.

ఆ॥ చీకుచింతలేక చిక్కులు సరిదిద్ది
సత్పథంబునందు సాకగలను
దిగులుమాని మీరు దినములు గడుపుడి
లోటుకలుగనీను నేటినుండి

కాన మీరు నిశ్చింతగాయున్న, మన నిత్యావసరములన్నియు నేను చక్కపెట్టగలను.

(అందరూ నిష్క్రమించెదరు. తదుపరి భార్య ఒకప్రక్కనుండి యోసేపు వేరొకద్వారమునుండి స్టేజిమీదకు రావలెను.)

భార్య : ఓయీ యోసేపు! ఎక్కడున్నావు?

యో : ఇక్కడే ఉన్నాను తల్లి. నేనిదే వచ్చుచున్నాను. (లోపలనుండివచ్చి వినయంగా నిలబడును.)

భార్య : నీకప్పగించిన పని పూర్తియైనదా?

యో : అయినది తల్లి!

భార్య : మొత్తము ఏమాత్రమైనది నగలకు?

యో : తల్లీ! యివిగో వస్తువులు. తరువాత లెక్కలప్పగించెదనని పనివాడు చెప్పియున్నాడు. ఇవిగో (అని యిచ్చును.)

భార్య : (హారము ధరించుకొని) ఇవిచూడు ఎంత అందముగా నున్నవో! (అని మెడచాచును)

యో : (వాటిని ముట్టుకొనుటకు వెనుకాడి దూరమునుండి చూచి) చాలా అందముగా నున్నవి తల్లీ!

భార్య : ఏం? వీటిని అంటుకొని చూచిన అంటుపడియెదవా?

యో : లేదు లేదు తల్లి! యువకుడనుగదా. అది భావ్యముగాదు.

భార్య : మన్మధా! తొలిచూపులోనే నామనస్సు నీయందు లగ్నమైనది.

యో : [చెవులు మూసికొని] మాతా! తప్పు తప్పు. నీవు నా తల్లివి. దిక్కులేని నన్ను చేరదీసి మాతాపితలకన్న మిన్నగా ప్రేమించి ఆశ్రయమిచ్చినారు,

భార్య : నా మనోభావమును ఈడేర్చగలవనే నిన్ను నేను మనసారా ప్రేమించి నీ కౌగిలిలో ఒదగవలయుననియే ఆశ్రయమిచ్చితిని.

యో : అమ్మా! అంతా మిథ్య. అయినా నేను నీ బిడ్డను. నీవు నా తల్లివి.

భార్య : నీ అందచందాలు నన్ను ఎంతగా ఉత్తేజపరచినవో తెలుసునా?

ఉ॥ చక్కనివాడ నా జతకు
చాలిన చుక్కలఱేడు వోయి నా
ప్రక్కనచేరి వేగముగ
మానసముల్లసిలంగ జేయుమా
చిక్కితివీవు నాకిపుడు
జిత్తులెరింగిన చిన్నవాడ నీ
అక్కునజేర్చ కోర యిపు
డాశలు దీర్చగ మన్మధుండవై

యో : అపచారము, అపచారము తల్లి. నీవు నాకు కన్నతల్లివి. దిక్కులేక పడసెకియున్న నన్ను ఈ రాజగృహంబున జేర్చుకొని ఆశ్రయ మిచ్చిన మీ ఔదార్యబుద్ధికి ముగ్ధుడనై తల్లిదండ్రులను మరచి మీరే ఆ దైవములని భావించి ఊరటజెందితిని. నా తల్లీ! అందు వలన నీ కోరికలకు కళ్ళెము వేయుము.

సీ॥ తల్లిదండ్రియనెడి తారతమ్యములేక
కామక్రీడలిచట కానిపనులు
తల్లిగా మెల్గుచు తనయుని కోరుట
దైవమొప్పదుతల్లి తగనిపనికి
పాపకార్యముజేసి పరమాత్మదృష్టిలో
పాపపు ముద్రను బడయ్యను
దేవునిదృష్టిలో తీరనిపాపము
తల్లినిగూడుట ధరణియందు

ఆ॥ అట్టి పాపకార్యమావంత ఒప్పను
మోసగించలేను పీసమైన
బిడ్డగాను నన్ను ప్రేమతో దీవించు
తల్లవైన నీవు తగినరీతి.

భార్య : ఓహో! అంతమడిగట్టుకొనిన నిష్టాగరిష్ఠుండవన్నమాట. మన్మధా! చాల పొరబడుచున్నావు. చేతచిక్కిన పండును అనుభవించక వచ్చిన సదవకాశమును జారవిడచి పిదప బాధపడెదవు. బాగుగా ఆలోచించుకొనుము.

యో. : లేదుతల్లి! తాత్కాలికమైన సుఖముకోసము నేను దేవుని దృష్టిలో నా యజమానికి అపకీర్తి కలిగించను.

భార్య : ఆహాహా! నీబోటి బుద్ధిమంతులను చాలామందిని చూచితిని.

ఆ॥ సుద్దులెన్నొ బల్కు ఉద్దండులుండిరి
పురుషజాతియందు తిరుగులేదు
చాటుమాటునందు సాగించుచుందురు
రసికతనములెన్నొ విసుగులేక

యో : ఎవడో దుర్మార్గుడు నూటికొకరు కోటికొకరుండవచ్చును. అందు వలన పురుషులందరూ చెడ్డవారు కారు. నీవు వచించిన భ్రష్టులెవరనగా.

ఆ॥ పాపకార్యమన్న భ్రష్టులు ప్రేమించి
ఇష్టమొచ్చినటుల యిలనుసాగు
దైవ బిడ్డలట్లు ధరణిలో మెలగరు
సృష్టి కార్యమందు చెడ్డగాను

భార్య : ఎమ్మెకాడా ! నీ నీతులు కట్టిపెట్టి నా వలపు పంట పండించక తప్పదు. రేగిన కోర్కెలను ఆపుట నాతరముగాదు. వరించిన నీ వలననే ఆపని పూర్తికాగలదు.

యో : తల్లీ ! నేనంతటి దుర్మార్గమునకు పాల్పడలేను. దయతో నన్ను బంధించకు.

భార్య : నిన్ను విడుచుట కల్ల. నా కోరిక ఈడేరనిదే నిన్ను కదలనీయను. నాకు మదనతాప మధికమైనది. ఏలననగా.

సీ॥ విద్యుత్తుకాంతులన్ వింతగా తలదన్ను
మేనికాంతులతోడ మెలగువాడ
కోలముఖముగల్గి కోర్కెలు రేపెడి
సౌందర్యమున్నట్టి సరసగాడ
బాహుబలముగల్గి వలపించు చెలికాడ
పొందుగోరుచునుంటి యిందువదన
ఆజానుబాహుండ అందాలరేరాజ
కన్నులు కైపెక్కె నిన్నుజూడ

ఆ॥ తాపమాపలేను దాపునజేర్చరా
మనసు నచ్చినట్టి వన్నెకాడ
ఓ పజాల నింకతాప భారంబును
హత్తుకొనుము నన్ను చిత్తుజేయ

అని దగ్గరకు సమీపింపబోవును.

యో : (తప్పుకొని) తల్లీ! నా విన్నప మాలకించుము.

ఆ॥ ఇంటిపెత్తనంబునిచ్చెను యజయాని
చక్కబెట్టగాను సకల పనులు
ఆలిపైన నెట్టి హక్కునొసగలేదు
సత్యమరయు మమ్మ సద్గుణాంబ.

భార్య : మదనా! విరహతాపముతో నా శరీర మెంతయో వేడెక్కిపోయినది. నీవు నాకు వశీకరణకాకున్న నీ మనుగడే దుర్భరమౌతుంది. బహుశా నాకొక అనుమానము.

ఆ॥ తాపమాపలేక దాపురించగనిన్ను
దూరదూరమునకు తొలగిపోవ
మగతనంబు నీలోమంటగలిసెనేమొ
తెలియకుండె నాకుతేటగాను

యో : తల్లి' నేనా యెహోవా దేవుని నమ్ముకొనినవాడను. నీవు నన్ను నిందించిననూ నేను ఈ చెడు కార్యమును చేయలేను. అట్లని ఆయన దృష్టికి నీచపాపిగా మసలలేను. క్షణభంగురమైన ఈ కోర్కెకు నేను దాసుడనుగాను. నన్ను మన్నింపుము.-

భార్య : సుందరాంగా! నిన్ను మనసార వాంఛించియున్నాను. నీతో యీ సృష్టికార్యము జరిగితీరవలసినదే. అట్లు కానియెడల

ఉ॥ పాపము చేతులారకొని
భారముమోయకు వన్నెకాడనే
నోపగజాలనోయి సఖ
ఊరటగల్గగ నాదరించు నా
తాపము బాపగా వినుము
దక్కెనదానిని చేయిజార్చకన్
కోపమువీడి నన్నుగని
కోర్కెలుదీర్పుము చిత్తుచిత్తుగన్

యో : తల్లి! అరునూరైనను, నూరుఆరైనను నేనట్టి దుర్మార్గమునకు ఒడి గట్టను. ఆ విధముగా నా యజమానికి నేను ద్రోహముచేయజాలను. ఆ యెహోవాదేవుని దృష్టికి పాపిగా తీర్చబడలేను గాన-

ఆ॥ వేడుచుంటినమ్మ వినయంబుగా నిన్ను
ఇట్టి కోర్కెమాని యిల్లుజొచ్చి
దైవభక్తిగలిగి ధరణిని మెలగిన
యశముగాంచగలవు వసుధయందు

భార్య : పన్నెకాడా! నీవు ఎన్ని నీతులు పలికినను నిన్ను విడుచునదిలేదు. నాకోర్కె తీర్చకుండా అడుగుముందుకువేయనీను. (అని కౌగలించు కొనబోగా యోసేపు తప్పించుకొనులోపల ఆయన పై వస్త్రము ఆమె చేతికి చిక్కెను.) (మహారౌద్రముతో) ఆహా! ఎంతటి క్రౌర్యము. ఈ దుష్టుని ఎంత ప్రాధేయపడినను మోహపాశమున ఉక్కిరిబిక్కిరియగు నన్ను వంచించి జారుకొనెను. వీడు యౌవ నుడే. అత్యంత సౌందర్యము కలిగినవాడు. ఒకవేళ మన్మథ శక్తు లుడిగెనా? లేదు లేదు వాడేదో భయముతో జారుకొనియెను. అతడు తప్పక రసికుడే. భయమువలననే నా ఆశలు అడియాసలుచేసినాడు ఏడి అంతుతేల్చనిదే నాకు నిద్రపట్టదు. అతనిని అధోగతిపాలు జేయుటకు ఈ పైవస్త్రము చాలును, చూపెద నా తడాఖ (వెంట్రు కలు విరబోసికొని బల్లపై తలఆన్చి కండ్లు మూసికొనును.

పోఫ : (ప్రవేశించి) దేవీ! నా ప్రాణసఖీ! ఏమి పలుకవేమి? ఏమిటి నీ మనోవ్యాకులము? ఎందులకిట్లుంటివి?

భార్య : (ముసుచుకొని పలుకదు ఉలకదు)

పోఫ : లలనామణీ! ఏమి నీ యలుకకుగల కారణము?

భార్య : నాథా! (అని కౌగలించుకొని యేడ్చును)

పోఫ : ప్రాణసఖీ! నీకు ఏమి ఆపద సంభవించినది? అవశ్యము నా కెరిం గించుము. నీ యాప్సిత మేమియో తృటిలో తీర్చెదను. చెప్పుదేవి. (అని బ్రతిమాలును)

భార్య : (గద్గదస్వరమున) నాధా! చెప్పనలవి ఘోరము జరిగినది. ఏమని చెప్పను.

పోఫ : ఎవరైనా నిన్ను దండించుటకు పైకివచ్చిరా?

భార్య : లేదు లేదు. మంచి మార్బలమున్న నాకే యిట్టి దుస్థితి వాటిల్లెనే. దిక్కు-దెసలేని ఆడుదానిగతి ఏమికావలెను?

పోఫ : ఏమి సంభవించినది దేవీ!

భార్య : చెప్పుటకు నోరాడకున్నది నాధా!

పోఫ : అబ్బా! విషయము చెప్పకున్న నేనేమి చేయగలను. చెప్పు అవ శ్యము. ఆ దుర్మార్గ మేమియో! చీల్చిచెండాడెదను. నాతో చెప్ప రానిదా?.

భార్య : లేదువ్రైదు. మీకంటే దిక్కు-నా కెవరు? తల్లి దండ్రి గురువు దైవము మీరే. ఈ ఆపదను మీకెరింగించక నేనెట్లు మనగలను?

పోతి : వెంటనే వాక్రుచ్చుము. ఆ సంగతి నేను వెంటనే తేల్చెదను. ఏమది వివరింపుము.

భార్య : మనయింటి యజమానిగా తాళము లప్పజెప్పియున్నారే. ఆ మహా నీయుడే నాకు కంతఉరియైనాడు.

పోఫ : ఆ! అంతటి మూర్ఖుడావాడు? ఏదైనా ఘర్షణ జరిగినదా పనులవద్ద.

భార్య : ఘర్షణకాదు. వాడికి ఆకర్షణ కావలసివచ్చినది.

ఉ॥ దుష్టుడు మోహపాశమున
ధూర్తతనంబున నన్నుకోరగా
దుష్టుని బారినుండి బహు
దూరముగాచన వెంబడించి నా
కిష్టముగల్గె నీయెడని
ఇంతిరో! ప్రేమతో ఆదరించి నీ
ఇష్టము వచ్చినట్లు భువి
నేలుము నన్నని హింసపెట్టెనే!

పోఫ : (పండ్లు పటపటకొరికి) కటకటా! ఏమి ఈ అపచారము. ఏమి ఈ వైపరీత్యము. ఆ దుష్టునికింత కండకావరమా? తల్లి రొమ్ముపాలు త్రావి తల్లిరొమ్ము గ్రుద్దినట్లు ఆ పాపిష్టి యింత నీచత్వమునకు పాల్పడెనా?

ఆ॥ ఓరి! వెధవ ఎంత ఘోరపాపివి నీవు
దిక్కులేని నిన్ను ఎక్కదీయ
జాలిబరపి మేము చక్కగా పోషింప
పొరలు గ్రమ్మె మదపుతెరలు పెరిగి.

భార్య : నాథా! నేను ఎంతగా బ్రతిమిలాడిననూ నామాట విన్నాడుకాడు.

సీ॥ తల్లినే మరిపించి దండిగా వీక్షించి
ప్రజలచేతను మెప్పుబడసినాను
అల్లారుముద్దుగా అన్నపానములిచ్చి
బిడ్డగాసాకితి ప్రేమబరపి
కోరిన దుస్తులు కుట్టించి నిత్యము
కంటికి రెప్పగా కాచినాను
సర్వంబు నీవని చక్కగా నమ్మిన
తల్లిని కోరుట తగదనంటి

ఆ॥ బ్రతిమలాడినాను పలుభంగు లాతని
మాటవినకపోయె చేటుమూడి
తుదకు బైటపడితి ధూర్తుని బిగినుండి
గుండెలవిసిపోయి కూలబడితి.

పోఫ : ఏడీ ఆ ధూర్తుడు! తిన్నయింటి వాసములనే లెక్కబెట్టినాడు నీచుడు

ఆ॥ నమ్మిచేరదీసి నగుబాట్లపాలైతి
ఎంత సిగ్గునాకు నెంత చింత
గుండెలవిసిపోయె గుణవతి నీకీతి
చెరపజూచినట్టి చెడ్డపనికి.

భార్య : ప్రాణసఖా! తత్తరపాటున నేను కేకలువేయగా భయపడి

ఆ॥ పెనుగులాటలోన విలువగు వస్త్రంబు
జారవిడిచిపోయె చవటవెధవ

విషయమెరుకపరచ విలువైన వలువను
దాచియుంచివాను తమకుజూప

ఇదియే నాతడు విడిచివెళ్ళిన వస్త్రము. (అని చూపించును.)

పోఫ : ఓయీ మూర్ఖుడా! యోసేపా! ఎక్కడనీవు?

యో : దుఃఖముతో వినయముజూపి) దేవరకు నా నమస్కారము. [అని మౌనముగా నిలబడును.]

పోఫ : ఛీ! ఛీ! దుర్మార్గుడ. నీ ముఖమును ఏమని చూపుచున్నావు? నీ నక్క వినయము నాకు చూపకు. విచక్షణారహితముగా నీవు ప్రవర్తించిన నీతీరుకు దండనమా? ముండనమా? కారాగారవాసమా నీకుడా.

యో : నాతండ్రీ! సత్యము నుడివెద. నా మనవి నాలకింపుము.

ఆ॥ ఎరుగనైతి తండ్రి ఏ పాపమునుగూడ
కల్లబొల్లిమాట లల్లబడియె
నాదురూప మిట్లు నగుబాట్లు కల్పించె
కపటమెరుగనట్టి కరుణమూర్తి

పోఫ : ఛీ! ఛీ! దుర్మార్గుడా! నిజముగా నీ రూపురేఖలు చూచియే మోసపోతిని. (కొంచెమువత్గి) అయిననూ నీవు నాయింట పాదమిడినకడ నుండి నా సంపద నా ఐశ్వర్యము మూడుపూవు లారుకాయలుగా నున్నది. అటువంటినీవు ఇట్టి దుర్మార్గమున కెట్లు పాల్పడితివి.

యో : లేదు ప్రభూ! నిజము నిలకడమీద మీకే తెలియగలదు. నన్ను నమ్మండి ప్రభూ.

భార్య : ఓరీ మూర్ఖుడా! సిగ్గులేదు. (కోపమున)

ఆ॥ జారవిడిచినావు నన్ననిపైగడ్డ
నేను పెనుగులాడు నిముషమందు
ఎట్లు తప్పుకొందు వీరీతిపనులకు
నోరుమూయవోయి నేరగాద!

(అని విసిరి ఆ వస్త్రము ఆతని ముఖముపై పారవేయును.)

పోఫ : ఏమిరా మూర్ఖుడా! ఈ సాక్ష్యమున కేమందువు. ఎట్లు తప్పించు కొనగలవు? ఎవరు నిన్ను రక్షించగలరు?

యో : మహాప్రభూ! అయ్యది నా దురదృష్టము. దైవోపహతుండైన డెందుబోయినను ఆపదలు వెంటవచ్చును. అయిన నేనేమి గలను. తమ చిత్తము.

పోఫ : ఇంటికాపలాగా యుంచగా యింటిమగడివై తిపన్నపూట

యో : ప్రభువర్యా! నేనట్టి ద్రోహినికాను. స్వామిభక్తి కలిగి వారికి సల్పి మన్నన పొందుటయే నావిధి.

పోఫ : ఛీ! మూర్ఖుడా! నోర్మూయ్. సిగ్గులేక యింకా నీతులు చున్నావు. ధూర్తుడా! నీకు తగినశాస్తి జరిపితేగాని నీకు సి ఎవరక్కడ?

1 2 భ : చిత్తము మహాప్రభూ! భటులమైన మేము తమ యాజ్ఞకై వేచి యున్నాము. చిత్తము సెలవిండు.

పోఫ : ఈతని నెప్పుడైనా చూచినారా?

1 2 భ : చూచినాము ప్రభూ!

పోఫ : ఈ దుర్మార్గుని తీసికొనివెళ్ళి కటిక చీకటియున్న కారాగారములో బంధించండి.

1 2 భ : చిత్తము మహాప్రభూ! (రాబాబూ అని లోపలికి తీసికొని వెళ్ళుదురు.)

.... తెర జారును. ....

## -: తృతీయాంకము :-

(పానదాయకుడు - భక్ష్యకారుడు నిలబడియుండగా, రాజు, సేనాధిపతి ఆశీనులై యుండవలెను. రాజు వారి నుద్దేశించి)

ఫ. రా. : సేనానాయకా! పానదాయకాధిపతి, భక్ష్యకారుల అధిపతి తమ యిచ్ఛవచ్చినట్లు చరించుచున్నారని ఫిర్యాదులు.

పో ఫ : ఔనుమహాప్రభూ! వేగులవలన సమాచారము అందినది. వారి విషయము చాలా ఆశ్చర్యముగా యున్నది. వారు దానికి తగిన శిక్ష అనుభవించగలరని నా మనవి.

ఫ.రా : అయితే వీరి ఆగడములు కోడై కూయబట్టే లోకమంతా కుతకుత లాడుచున్నది.

పోఫ : ఔను మహాప్రభూ! నిజానిజములను తెలిసికొనుటకు వేచియుండి మీవరకు యీవార్త తేలేదు. అయితే వారి పాపముపండి వారంతట వారే చిక్కియున్నారు?

ఫరా : త్రాగి మత్తిలి దేహమునేమరచి పనివారలను అల్లరిపెట్టుట కూడని పని. ముందు వారిని చెరసాలలో బంధించమని మా ఆజ్ఞ.

పోఫ : చిత్తము. అటులనే బంధించెదము.

ఫరా : రౌతు మెత్తనైన గుఱ్ఱము మూడుకాళ్ళను నడచినదట. వీరిని తగు రీతిని శిక్షింపకున్న యితరులు జాగ్రత్తపడరు

పోఫ : ఎవరక్కడ?

1 2 భ : చిత్తము ప్రభూ! తమ సేవ.

పోఫ : భటులారా! వీరిని చెరసాలలో బంధించుడి.

1 2 భ : ఓసీ! వెంగళప్పలారా! ఒప్పుమరచి చరించువారికి ఈ నరకము తప్పదు. మీరు ఈతనిగదిలో బంధింపబడుటకు హుకుము జారీచేయ బడినది. (అని లోనికి తీసికొనివెళ్ళును.)

పాన : (చెరసాల గదిలోవున్న యోసేపునిచూచి) ఓయీ! నీవెవ్వరివాడవు? ఎందుకు నీకీ దుర్గతి ప్రాప్తించినది?

యో : నా విధివ్రాతయేగాని నేనుచేసిన పాపమునకు కాదు ఈ కారాగార వాసము.

భక్ష్య : అయితే నేరములేకనే జైలుశిక్షా?

యో : ఔను. ఏనాడు ఎవరికి ఏదుర్గతి ప్రాప్తించునో ఎవరికెరుక? అదంతయు ఆ పరమాత్ముని విధిపై ఆధారపడియుండును.

పాన ; ఔను. చేయని నేరము నా నెత్తిపైకొచ్చినది. ఒకనిని రక్షించబోయి భక్షించబడితిని.

యో : ఔను. తప్పుమారిన ధర్మము మొదలుచెడ్డా బేరమని పెద్దలు ఊరకనే నుడువలేదు.

భక్ష్య : నేను బుద్ధిపూర్వకముగా చేసినదికాదు గాని నాఖర్మమిట్లు కూల వలసియుండి యిలా జరిగినది.

యో : అవును, కానున్నదేదైనాకాకమానదు. అంతా ఆ దైవచిత్తము.

పాన : ఓయీ యువకా! నీవు చాలమంచివానిగా కాన్పించుచున్నావు. యువకుడవు. ఉత్సాహివి, ప్రవర్థమానుడవు. చాల మంచిది.

భక్ష్య : ఔనౌను. అక్షరాల నీమాటలు సత్యములు. నాకదే భావము కలుగుచున్నది.

పాన : బాబూ! మేము నిద్రకు జోగుచున్నాము. కాన నీవావల పరుండుము మేము కొంత విశ్రాంతిగైకొనెదము. [యోసేపు లోనికివెళ్ళగా వారిరువురు బల్లలకు ఆనుకొని నిద్రించుచూ త్రుళ్ళిపడిలేచి భయముగా వణుకుదురు.]

యో : [లోనినుండి వచ్చి] అధిపతులారా! ఏమి. మీ ముఖములు కళదప్పి వణుకుచున్నారేమి?

పాన : బాబూ! ఏమని చెప్పము? తలంచుకొనిన గుండె గుభేలుమంటున్నది. భయంకరస్వప్నము.

యో : ఏమని కలగన్నారు!

పాన : ఏమి ప్రయోజనము. నీవా అర్భకుడవు. చెప్పిమాత్రము ప్రయోజనమేమి? కలలభావము చెప్పుట సామాన్యుల కయ్యేడి పనికాదుగదా (అని నిట్టూర్చును.)

యో : కలల భావము చెప్పుట దేవుని అధీనములోయున్నది. భక్ష్యాకారా! నీ పరిస్థితి ఏమి?

భక్ష్య : ఏమోబాబూ! నేనూ అదే అవస్థలో మునిగియున్నాను.

యో : అయినా తాము కనిన కలను చెప్పగలరా? పానదాయకాధిపతీ!

పాన : సరే ఉబుసుపోకకైనా మీతో చెప్పి తృప్తిపడెదను. చెప్పెద వినుము

సీ॥ ద్రాక్షతీగెలు మూడు దగ్గరకాన్పించి
చిగురించె నయ్యవి చిత్రగతిని
పూవులుపూసియు ముద్దుగా పండ్లాయె
చూచుచుండగ నేను వోద్యమొంద
పాత్రనుచేపట్టి పండ్లరసముపిండి
పాత్రను రాజుకు పట్టియీయ
తడయక నాప్రభు దానిని సేవించె
సంతసంబున నట్లు సరసహృదయ

ఆ॥ దీని భావమేమొ తెలియక దిగులుచే
కుందుచుంటినోయి గోడుజెంది
తెలియపరచుమింక తిన్నగా భావంబు
సత్యవ్రతుడవైన సాత్వికుండ.

యో : కలలభావము చెప్పుట దేవుని యధీనమంటినిగదా! ఆయనే నీకు మార్గము చూపగలడు.

ఆ॥ మూడు తీగెలనిన మూడు దినంబులు
గడువగానే రాజు కరుణజూపి
పానపాత్రనిచ్చు పనిలోన నిల్పును
దిగులుమాని నీవు దిరుగవచ్చు.

పానదాయకాధిపతీ! మూడు తీగెలనిన మూడు రోజులు ఈ మూడు దినములు గడువగనే నీకు మేలు కలుగును. ద్రాక్షతీగెలు పూసి పండ్లు పండుట అనగా పండ్లుపిండి రాజుకు పానపాత్ర అందించుట. నీపని నీకు యధావిధిగా రాజు అనుగ్రహించునని దీని భావము.

పాన : ఆహా! ఏమి యీ అద్భుతము. అర్భకా నీవు వచించినట్లు నాకు మేలుజరిగిన నిన్ను తీయని వంటకములతో ఊహించని బహుమతులతో ఉక్కిరిబిక్కిరి జేసెదను.

యో : పానదాయకా! నాకు బహుమతు లక్కరలేదు గాని నీవు సమయమొచ్చినపుడు నాకు జరిగిన అన్యాయమును రాజుకడ వివరించి చెరసాలనుండి నాకు విముక్తి కలిగించుము.

పాన ; వత్సా! అంతకన్ననా? నేను కృతఘ్నుడనుకాను. సమయమొచ్చినపుడు నీవే చూచెదవు. నాకీ మేలు జరగనిమ్ము.

యో : దైవమునీయందున్నాడు. నిశ్చింతగా నుండుము.

భక్ష్య : జ్ఞానవంతుడా! నాకల భావముకూడా చెప్పి పుణ్యము కట్టుకొనుము

యో : నీవు ఏమని కలగంటివి. అవశ్యము వచింపుము.

భక్ష్య : ఏమో! నాకు గుండె వణకుచున్నది. ఏమి జరుగునో ఏమో!

యో : అ దైవమే అన్ని చూడగలడు. భయపడక ఆ స్వప్నమేదో వచింపుము.

భక్ష్య : అట్లయిన చెప్పెద సావధానముగా నాలకింపుము.

సీ॥ మూడు గంపలలోని మూడు వంటకములు
నెత్తిపైదాల్చి నే నిలిచియుండ
పక్షులు గుంపుగావచ్చి గంపలలోని
పిండివంటలనెల్ల దండుకొనెను.
గంపలు పక్షులు కలలోన కాన్పించె
తేటతెల్లముగాను దివ్యమూర్తి
ముందుగా నాకేమి ముప్పురానున్నదో
దిగులు గలుగుచుండె మిగులనాకు

గీ॥ దీని భావంబు దెలియక తత్తరమున
మేసువణకుచునుండెను మిక్కుటముగ
దీని భావంబు దెల్పియు దిగులుమాన్ప
ప్రణుతులిడుదును యోగ్యుడా మనవి వినుము.

యో : (విచారముగా నిట్టూర్చి) ఏమని చెప్పను. నాకు నోరాడకున్నది.
నీ కలభావము బహు చెడ్డది.

భక్ష్య : మహాపురుషా! నాపై దయనుబరపి సెలవిమ్ము.

యో : అయిన చెప్పెద నిబ్బరము గలిగియుండుము.

గీ॥ మూడు గంపలనిన నిను మూడునాళ్ళ
పక్షి భక్షించు ముద్దలు మాంసమోయి
తలను పైకెత్తి ఆనాడు తలనుదీయ
పక్షులాడును తలపైన పరవసించి

కాన మూడు దినములలో నీకు శిరచ్ఛేదము తప్పదు ఇది నీ కల యొక్క పూర్తిభావము.

భక్ష్య : (గడగడవణకుచు) మహానుభావా! నాగతి యింతేనా? దైవమా నే నేమి పాపము చేసితినని నన్నింత కర్కశముగా శిక్షించినావు, దైవమా! ఇక నాకు ముక్తిలేదా?

ఆ॥ మరణపాత్ర నెటుల ధరణిని భరియింతు
దిక్కులేద నాకు దేవదేవ
ముందుచూపులేక మున్గితి నిందుగా
ఏడ్చిన ఫలమేమి యిప్పుడిట్లు?

అయినా దీపముండగానే యిల్లు చక్కబెట్టుకొననైతిని. ఆపద కమ్ముకొనగా ఎవరు రక్షింపగలరు?

ఆ॥ దీపముండగానె దిద్దనైతిని కొంప
కండకావరమున ఖలుడనయ్యి
శిరసు కొయ్యపైన ఛేదించనైయుండె
గుండె బగులుచుండె మెండుగాను

సోదరులారా! నా విద్యుక్తధర్మమును విస్మరించి ప్రజలవద్ద అంది నంతవరకు గుంజి త్రాగుబోతునై మత్తిలి దయాదాక్షిణ్యములులేక హత్యలు, గృహదహనాలు ఎన్నో చేయించితిని. ఆ పాపభారము నేను వహింపక తప్పదు. లోకములో ఎవరికైనా వారి పాపములు పండకమానవు. ఇక నాకు రోజులునిండినవి. సోదరులారా! మీరైనా

బుద్ధిగలిగి ప్రజలకింత మేలుచేసి యిటువంటి శిక్షకు దూరముగా నుండుడి. కాన నావలె యిట్టి ఘోరశిక్షకు పాత్రులు కావద్దని నా విన్నపము.

(లోనికి వెళ్ళును.)

ఫరా : (వెంటనే ప్రవేశించి, సేనాధిపతీ! పానదాయకాధిపతిని, భక్ష్యదాయకాధిపతిని గూర్చి తీర్పు ఏమని వచించడమైనది?

పోఫ : మహారాజా! వారికేసు విచారణ, వాదోపవాదాలు ముగిసి తీర్పు చెప్పడమైనది.

ఫరా : కేసులు కొట్టివేసిరా? లేక శిక్ష విధించిరా?

పోఫ : మహాప్రభూ! పానదాయకాధిపతిని కోరు నిర్దోషిగా తీర్పు చెప్పి వానిని తన పనిలో నియుక్తుని చేయమని కోర్టు వారి అజ్ఞ

ఫరా : మంచిది. భక్ష్యాధికారఅధిపతికి ఏమని తీర్పు చెప్పబడినది?

పోఫ : అతడు నేరస్తునిగా కోర్టు నమ్మినది. ఆతని కేసులు ఋజువైనవి. తలలుమార్చి తలలు తీసిన ఆ పొగరుబోతుకు తగిన శిక్షయే విధించినారు.

ఫరా : ఏమది? ఆతడంతటి క్రూరుడా?

పోఫ : అవును మహాప్రభూ! అన్నములో సున్నము కలిపి పేదలనోళ్ళు కొట్టుటయేగాక హత్యలు, గృహదహనములకాండలు ఋజువగుటచే శిక్ష గొప్పగా విధించినారు.

ఫరా : అయిన ఆతనికి విధించిన శిక్షఏమి?

పోఫ : ఆతనిని ఇక మూడురోజులకు ఉరికొయ్యపై తలనుపైకెత్తి ఒక్క వేటున తెగవేయుమని న్యాయమూర్తుల ఆజ్ఞ ఆయెను.

ఫరా : మంచిది. తగినశిక్షనే విధించియున్నారు, లేకున్న మూర్ఖులకు ఆటి పట్టుకాగలదు ఉత్తరువులు జారీయైనవా?

పో ఫ : చిత్తము మహాప్రభూ! ఉత్తరువులు జారీయైనవి, ఇంకా మూడు దినములలో పానదాయకునికి పదవీయోగము. భక్ష్యకారులధిపతికి ఉరిశిక్ష.

ఫ.రా. : అటులనే వెనువెంటనే తత్సంబంధిత కార్యక్రమమున కుపక్రమించిన దుర్మార్గులకు కనువిప్పు కాగలదు. నేను కొంతసేపు విశ్రమించెదను.

పోఫ : చిత్తము మహాప్రభూ! అటులనే అన్ని ఏర్పాట్లనుగావించి శిక్షనములు జరపింపజేసెదను. (అని లోనికి వెళ్ళును)

ఫ.రా : (అటులనే కూర్చుని బల్లపై తలవాల్చి నిద్రించవలెను. నిద్రనుండి త్రుళ్ళిపడిలేచి) ఎవరక్కడ? ఎక్కడ మన సిబ్బంది?

పోఫ : ఏమి నా ప్రభూ! ఏమిటా కలవరింపు?

ఫరా : కలవరింపుకాదు సేనాధిపతి. నాకొక స్వప్నమువచ్చి భీతావహుని చేసినది. దానినిబట్టి మనకు ఏదో విపత్తు రానున్నదని నా భయము

పోఫ : లేదు మహారాజా! అట్టని మందిమార్బలమును గూర్చి తక్కువ అంచనా వేయరాదు. చింతించవలసిన పనిలేదు.

ఫరా : లేదు లేదు అంతరంగికా! ఏదో ఆపద సంభవింపనై యున్నది. మన కిది మేలుకొల్పుగా సూచింపబడెను.

అ॥ శత్రుభయములేక చల్లనిపాలన
సాగిపోవుచుండ వేగిరమున
కొంపమునిగె మనకు కువలయంబుననేడు
దీని భావమేమొ తెలుపుడోయి.

అవశ్యము, జ్యోతిష్కులను, యోగులను రావించి వారిద్వారా నా కూరటగల్గించుడి. లేకున్న రాజ్యమును చేతులార చేజార్చుకొనవలసి యుండును. (స్టేజిమీద రాజు అటుయిటు తిరుగుచుండును.)

పోఫ : మహాప్రభూ! తమ ఆజ్ఞానువర్తులమై జ్యోతిష్కులను రావించి విషయము నెరింగించి వివరము తెలిసికొందును. (లోనికి వెళ్ళి వచ్చి) ప్రభువర్యా! పరివారమును పంపి తెలిసికొంటిమి. కాని వారికి అంతుబట్టలేదు

ఫరా : ఒక శుభవార్తవినియుంటిని. మన రాజధానిలోనే కలలభావము చెప్పగల యువకుడొకడున్నాడని యిప్పుడే తెలిసినది.

రా : ఏమది? ఎవ్వరాతడు? మన రాజధానిలోనేనా!

పోఫ : ఔను ప్రభూ! మన రాజధానిలోనే.

ఫరా : మీకా విషయము ఎలా తెలిసినది?

పోఫ : మన పానదాయకుని ద్వారా తెలిసినది.

ఫరా : ఆఁ ... మనపానదాయకుడు! ఏ విధముగా? ఆశ్చర్యముగానున్నదే! అయిన మంచిది. అయితే మనమీ గండమునుండి బైటపడగలమన్న మాట.

పోఫ : తప్పకుండా మహాప్రభూ!

ఫరా : అయితే సంక్షేమాధిపతీ! తనకే విధముగా తెలియును?

పోఫ : మన పానదాయకుని, భక్ష్యకారాధిపతిని కారాగారాములో బంధించి నపుడు వారితోపాటు ఒక హెబ్రీయ యువకుడు జైలులో మగ్గు చున్నాడు.

ఫరా : అయితే ఏమి జరిగినది. వారేమైన కలలు కనియుండిరా?

పోఫ : ఔను మహాప్రభూ! ఒకరోజురాత్రి జైలులోఉండగా ఒకేరోజు రాత్రి వారిద్దరు కలలుకన్నారట. దానితో వారు వేదనతో క్రుంగి యున్నారట.

ఫరా : అయితే నన్ను ఆవరించన దిగులు వారిని ఆవరించియున్నదన్న మాట. తదుపరి ఏమి జరిగినది?

పోఫ : ఆ హెబ్రీ యువకుడు వారు చింతాక్రాంతులైయుండుటచూచి వారి నడిగి తెలిసికొన్నాడట.

ఫరా : ఆడబోయిన తీర్థము ఎదురైనట్లు అతడే వారి నడిగి కలల భావము ఎఱింగించి యున్నాడన్నమాట. ఏదీ ఆ పానదాయకుని యిక్కడకు రావించండి.

పోఫ : చిత్తము మహాప్రభూ! యేయ్! ఎవరక్కడ?

1 భ : చిత్తము మహాప్రభూ!

పోఫ : నీవు అవశ్యమువెళ్ళి పానదాయకఅధిపతిని వెంటనే రాజుగారి సమక్షమున ప్రవేశ పెట్టుము.

1,2భ : చిత్తము మహాప్రభూ! అటులనే ప్రవేశపెట్టెదము. (అని లోనికి వెళ్ళి ఆతనిని ప్రవేశపెట్టుదురు.)

పాన : (నమస్కరించి) చిత్తము మహాప్రభూ! తమ ఆజ్ఞానువర్తుడనై వచ్చితిని.

పో.ఫ. : పానదాయకాధిపతీ! మహారాజులవారికి ఒక భయంకరమైన కల వచ్చినదని కలవరపడుచున్నారు. నీకు జరిగిన సంగతి ప్రభువుల వారికి వివరించు.

పాన : చిత్తము అలాగే! (రాజుగారికి నమస్కరించి) మహాప్రభూ! మీ దాసుడనైన నేను తమ ఆజ్ఞానువర్తుడనై వచ్చితిని.

ఫ.రా. : పానదాయకాధిపతీ! మంచిది. మంచిది. ఏదీ నీవు కనిన కల భావము చెప్పినదెవరు?

పాన : మహాప్రభూ! మేము చెరసాలలో యున్నపుడు మాతోపాటు ఒక హెబ్రీ యువకుడు చెరసాలలో బంధింపబడియున్నాడు. అతడు మా కలలను అడిగి తెలిసికొని జరుగబోవు కార్యక్రమమును పొల్లు పోకుండా చెప్పియున్నాడు

ఫరో : మీరేమని కలలుగంటిరి?

పాన : నాకలలో మూడు ద్రాక్షతీగెలు కనిపించి. చిగురించి, పుష్పించి, ఫలించి పండ్లుపండగా వానిని పాత్రలోపిండి తమ కందించినట్లు కలగంటిని

ఫరో : అయితే అతడు దాని భావమేమని చెప్పెను?

పాన : మూడు ద్రాక్షతీగెలు మూడురోజులకు గుర్తనియు, మూడుదినము లైన తరువాత రాజుగారు నిన్ను నీపనిలో నియమింపజేయుననియు చెప్పెను. చెప్పిన భావము అక్షరాల జరిగినది.

పో.ఫ : భక్ష్యకారుడేమని కలగనెను అతనికికూడా ఆ యువకుడు చెప్పి నట్లు జరిగినదా?

పాన : ఔను ప్రభూ! అతని తలపై మూడు గంపలున్నవట. అందులో తెల్లని పిండివంటకము లున్నవట. వానిని పక్షులు తిన్నుకొని పోవు చున్నవని కలగన్నాడట.

ఫ.రా : దాని భావమేమని వివరించెను?

పాన : మూడుగంపలు మూడురోజులనియు. ఇక మూడు దినములకునిన్ను ఉరికొయ్యపైనిలిపి నీ తలపైకెత్తి నరికి వేయుదురనియు, అప్పుడు పక్షులు నీ మాంసమును తన్నుకొని పోవునని చెప్పియున్నాడు.

ఫ.రా : సంక్షేమాధిపతీ! ఇటీవల భక్ష్యకారునికి విధించిన శిక్ష అదియేగదా!

పో.ఫ : ఔను మహాప్రభూ! సాక్షాత్తు ఆ శిక్ష మన ప్రభుత్వము అమలు పరచినదేగదా! ఇందులో అనుమానమేమున్నది.

ఫ.రా : భేష్! ఇపుడు నా మనసుకు నెమ్మది చిక్కినది. కాని నా కల భావమేమోగదా!

ఫ.రా. : పానదాయకాధిపతీ! ఇప్పుడా హెబ్రీ యువకుడెక్కడ.

పాన : మహాప్రభూ! అతడిప్పుడు చెరసాలలో బంధింపబడియున్నాడు.

ఫ.రా : అయిన ఆతనిని యిపుడే ప్రవేశ పెట్టుడి.

పో.ఫ : చిత్తము అలాగే ప్రభూ! ఎవరక్కడ?

1, 2భ : చిత్తము మహాప్రభూ!

పో.ఫ : మీరు వెంటనేవెళ్ళి చెరసాలాధిపతికి హుకుముచూపించి కారాగారములో ప్రస్తుతమున్న ఆ హెబ్రీ యువకు నిచటకు తోడుకొనిరండు,

1, 2భ : చిత్తము మహాప్రభూ! అలాగే యొనర్చెదము! (అని లోనికివెళ్ళి యోసేపుని తోడ్కొని వత్తురు.)

పో.భ : భటులారా! మీకప్పగించిన కార్యమును ముగించితిరా?

2 భ ; చిత్తము మహాప్రభూ! ఇదిగో ఆ యువకుని తీసికొనివచ్చితిమి.

(యోసేపు ప్రవేశము. ప్రొ. ఫరోరాజు ప్రక్కన నిలబడును.)

ఫ.రా. : మంచిది. అబ్బాయీ నీ పేరేమి? ఏ దేశము?

యో : (నమస్కరించి) నాపేరు యోసేపు. మాది కనాను దేశము.

ఫ.రా. : చెరసాలపాలగుటకుగల కారణము?

యో : అది నా దురదృష్టము. ఎవరిని నిందించి ఏమి ప్రయోజనము. నా దుర్దశకు నేనే దుఃఖపిల్లుచున్నాను, అది విధికృతము.

ఫ.రా : అయితే నీవేదో మానసిక బాధతో క్రుంగియున్నట్లున్నావు!

యో : ఔను మహాప్రభూ! తమరు నన్నిటకు పిలిపించిన కారణము. (భయముగా అడుగును.)

ఫ రా : నీకు వచ్చిన ప్రమాదమేమియులేదు. భయపడకు. అత్యవసరమైన పనియుండి నిన్నిచటకు రావించియున్నాము.

యో : ఇంకా నాకేదైనా శిక్ష విధించియున్నారా ప్రభూ!

ఫ రా : లేదు లేదు. నీవొక కల భావము చెప్పవలెను.

ఫ.రా : దానిభావము తెలియక ఎందరినో జ్యోతిష్కులను రావించగా వారు

చెప్పలేకపోయిరి. పానదాయకాధిపతి నీ విషయము చెప్పగా ఇక్కడకు ప్రవేశపెట్టితిమి.

యో : ప్రభూ! మీరేనా కలకనినది?

ఫ.రా : ఔనౌను.

యో : చిత్తము మహాప్రభూ! మీరు కనిన స్వప్నమేమో సెలవీయ విన్నపము.

ఫ.రా : విజ్ఞానమూర్తీ! ఒకరాత్రి నేను కలగంటిని. ఆ కల స్ఫురణకు వచ్చినపుడల్లా శరీరము గడగడ వణికిపోవుచున్నది.

యో : ఏమని కలగంటిరి మహాప్రభూ! అవశ్యము సెలవీయమనవి. కలల భావముచెప్పుట దేవుని ఆధీనములో నున్నది. అయిననూ సెలవిండు

ఫ.రా : నేను నిద్రించుచుండగా అర్ధరాత్రిలో

చ॥ బలిసిన సప్తగోవులను
బల్హీని గోవులు మ్రింగియుండగా
బలిసిన ఏడుకంకులను
బల్హీని కంకులు మ్రింగివేసె! నే
మెలుకువవచ్చి చూడగను
మిక్కిలి భీతిలినాడ మిథ్యయై
కలయని తెల్సి క్రుంగితిని
కంపరమెత్తియు నగ్గలంబుగన్

యో : మహాప్రభూ! రాబోవు ముప్పును తప్పించుటకు దయార్ద్రపరులైన రాజాధిరాజగు మీకు ఆ దైవమే ఆ కల కలిగించెను,

సీ॥ ఏడుసంఖ్య మనకు నేడేండ్లకు గురుతు
స్పష్టంబుగా జూపె సద్గురుండు
బలిసిన ఆవులు బలిసిన కంకులు
దండియౌ పంటకు దర్పణంబు
చిక్కిన ఆవులు చిక్కిన కంకులు
కరువుకు చిహ్నమై కానిపించె
ముప్పు దప్పుకొనగ ముందుగా వివరించె
స్వప్నంబులో నట్టి సత్ప్రభుండు

ఆ॥ దిగులుమాని మీరు తనుకీర్తి వరియింప
ముప్పుదప్పగలదు ముందుముందు
అప్రమత్తులైన ఆశలు ఫలియించి
మేలుపొందగలరు వీరవరుడ

కాన దీనికి మీరు తరుణోపాయ మాలోచించి ఆ ఏడేండ్ల కరువును నివారించుటకు ఆయత్తపడమని దాని భావము.

ఫ.రా : యోసేపూ! మహామహా పండితులైన జ్యోతిష్కులు పులిచర్మములు దాల్చి హంగామాతోవచ్చి యీ గుట్టు చెప్పలేకపోయిరి. ఎంతటి ప్రజ్ఞా పాటవములుగలవాడవు సుమా!

ఉ॥ మెచ్చితి నీదుప్రజ్ఞగని
మేలిగుణంబుల జాతిరత్నమా
సచ్చగు విద్యలం బడసి
సాగిరి యోగులు మోసగించగన్
మచ్చలుజూచి చెప్పుదురు
మాటలు నిత్యము సిగ్గుపీడియున్
ఎచ్చట నేర్తురో ఎరుగ
నేమని చెప్పుదు వారి మోసముల్

అటువంటి దుష్ట సాంప్రదాయములుదాటి యింత మంచిమేధావి దక్కుట నా యదృష్టము.

యో : మహాప్రభూ! ఆదిఅంతయు ఆ సర్వాంతర్యామి మహాకృపయేగాని నా గొప్పతనముగాదు.

ఫరా. : సంక్షేమాధిపతీ! మనము వెంటనే. కార్యోన్ముఖులమగుట మంచిది.

పో.ఫ : చిత్తము తమ ఆజ్ఞానుసారులమై వర్తించెదము.

ఆ॥ చిక్కులధిగమించి చేరగా గమ్యంబు
దారిదొరికెనేడు ధన్యచరిత
ప్రజల మేలుగోరి పరమాత్మ డీరీతి
మేలుగూర్చె మనకు మిక్కుటముగ

హెబ్రీయుడైన ఈ యువకునకు మన మెంతయో ఋణపడి యున్నాము.

యో : గౌరవనీయా! అంత గౌరవమునకు నేనర్హుడనుగాను. అదిఅంతయు ఆ దేవదేవుని చిత్తమే.

ఫ రా. : ఓయీ! దైవదత్తమైనవిత్తమా! నీవు యిక మాకడ నుండవలసినదే. తగిన వెరవూహించి తరుణోపాయము వెదకవలసినదే. అందువలన-

సీ॥ నావారసుండవు నా రాజ్యమేలంగ
అన్యులెవరు చాలరందగాడ
పదవినుండి తొలగి పరిపాలనముజేయ
పాదుకొల్పెదనిన్ను పదవియందు
భారమనక ధరిన్ పాలింపగలవోయి
దివ్యదృష్టిబరపి దిగులులేక
సుఖముగూర్పగలవు నిఖిలంబు కొనియాడ
పేదసాదలకును ప్రియము గలుగ

ఆ॥ రాజముద్రనిచ్చి రాజ్యంబునిచ్చెద
అడ్డుపలుకకుండ అందుకొనుము
మురిసిపోయె యెదలు దరహాసవదనుండ
యశము గాంచుమయ్య దిశలు నిండ

నిన్నుచూడ నా మనంబుపొంగుచున్నది. ఇకమీదట ముందువలె-పిదప నేను. ఆవిధముగా నీకు రాజ్యాధికార మప్పగించుచున్నాను. ఇక రాజ్యభారము నీదే. (అని సన్నని నారబట్టలుతొడిగి, ఉంగరము తొడిగి, హారము వేయును. తాళములు, రాజముద్రిక లందించును.)

యువరాజుకి జై! యోసేపు వర్ధిల్లాలి. ప్రజాబాహుళ్యమా! రాజో ద్యోగులారా! అందరు నమస్కరించండి (అందరు జై చెప్పి నమ స్కరింతురు)

యో ; (వినమ్రుడై గడగడవణకుచు రాజ్యభారము గైకొనుచు.) ఏలిన వారా! నే నీ పదవి గౌరవంబు కాపాడగలనో లేదో. అనుభవము లేని అర్భకుడనగు నేను భయపడుచున్నాను. ఇంతవిశాలమైన రాజ్య భారమును నా భుజస్కంధములపై మోపుటచూడ మోయరాని భారమే. అయిననూ ఆ యెహోవా దేవుని దయవలన ముందుకు సాగుదము.

గీ॥ పదవిభారంబు మోయుట మాటగాదు
తరతమ తరగతులగు యీ ధరణిప్రజలు
ఒక్కబాటను నడచిన చిక్కులేదు
అట్లు నడుపంగదలచిన అడ్డులెన్నొ.

అయినా ఆ పరమాత్ముని దయనుబడసి రాజ్యభారంబు వహించెద.

పోఫ. : యువరాజా! మీకు తోడు దైవబలము నిండుగాయున్నది. మీ కెదురులేదు మీరు నమ్మిన ఆ దేవదేవుడే చిక్కులన్నియు నధిగ మింపజేసి మీ రాజ్యమును కంటికి రెప్పవలె కాపాడగలడు.

యో : రాజసంరక్షకా! మీ పెద్దల దీవెనలు అమృతప్రాయములు, మీరు నన్ను వెన్నుకాచిన కొండంతబలము. మీదట ఆ ప్రభువే మనలను నడిపించును.

పో.ఫ : యువనాయకా! జయము జయము. దిగ్విజయము మీకు మార్తాండ తేజా. మనోనిబ్బరముగలిగి మెలిగిన ఆ ఆకాశరాజు

ఆ॥ భక్తిపరులయెడల పరమాత్మ దయగల్గి
నడుపగలడు తాను విడువకుండ
చేయనున్న పనులు చెంచెరసాగించి
ముప్పుదాటజూడు మెప్పుబొంద.

యో : బహుచక్కగా వచించితిరి అయిన మనము అవశ్యము చేయవల సిన పనులగూర్చి యోచించినారా?

పో.ఫ : చిత్తము. ఆ స్వప్నభావమునుబట్టి మొదటి ఏడు సంవత్సరములు మంచిపంట పండును గదా!

యో : ఔను. అందుకు సంశయింపవలసినపనిలేదు.

పో.ఫ : అందువలన రైతులను ప్రోత్సహించి అధిక దిగుబడికొరకు అన్ని విధములవారిని ప్రోత్సహించి యేడు సంవత్సరములలోని ధాన్య మును కొంత నిలువ చేయవలయును.

యో : అట్లని మనము మిన్నకుండరాదు. కార్యోన్ముఖులమై ముందున్న గండములు దాటవలెను.

మం : మీ యూహ సరియైనది. అందుకు తిరుగులేదు. విధముగా మనము అధిక మొత్తములో ధాన్యము పండించి నిలువచేయగలము.

యో : అయితే రాజ్యమంతా తిరిగి దశాలుగా ఏర్పాటుగావించి ఆర్థికసాయ

మును అందించవలెను. కానున్న రెండు కాళ్ళ పందికొక్కులు దిగ మ్రింగి రైతులనోట మట్టికొట్టగలరు జాగ్రత్త.

పో.ఫ. : అట్లని తలంచి ముందుగానే వేగుల నేర్పరచితిని.

యో : ఔను. ఇక రహస్య దొంగతనములు దాగుటకు వీలులేదు మంచి పనిచేసితిరి.

పో.ఫ. : మధ్యమధ్య మనముగూడ మారువేషమున సంచరించి పంటలను అంచనావేసి ఉంచవలెను.

యో : మంచిది. అట్లు సత్కార్యములు చేయుటకు నే నెల్లప్పుడు సంసిద్ధుడను. మనోనిబ్బరము గలిగి ముందుకు సాగుదము. అన్ని కార్యములు ఆ దైవమే చక్కబరచగలడు.

పో.ఫ. : చిత్తము. అటులనే ఆజ్ఞానువర్తుడనై అప్రమత్తముగా నుండెదను.

.... తెర జారును. ....

## * చతుర్థాంకము *

(యాకోబు, తన బిడ్డలు ప్రవేశము)

యా : బిడ్డలారా! కరవు దేశమున తాండవమాడుచున్నది. ఐగుప్తునకు వెళ్ళి ధాన్యము తెమ్మని చెప్పుచుండగా ఎందువలన మీరు ఒకరి ముఖము ఒకరు చూచుకొనుచున్నారు?

రూ : లేదు నాతండ్రి! ఐగుప్తులోనైనా ధాన్యము దొరుకునో లేదోయని సంశయించుచున్నాము.

షి : ఔను పితాజీ! విపరీతమైన కరువు అంతటా వ్యాపించియుండగా అచట మాత్రము ధాన్యము దొరుకుననెడి నమ్మకమేమున్నది?

యూ : నిజమే! అదియును యోచించదగిన విషయమే.

యా : లేకేమి? ఐగుప్తులో పుష్కలముగా ధాన్యమున్నదని వినియున్నాను. మనము ఈ కరువులో చావకుండునట్లు మీరు ఐగుప్తు దేశమునకు వెళ్ళి ధాన్యమును కొని తెండు.

లే : కన్నతండ్రిమాట తిరస్కరించుట పాడిగాదు. గాని అచ్చట మనకు పరిచితులెవ్వరూ లేరుగదా!

జెబు : నిజమే సోదరా! నాకును అదియే సంశయము కలుగుచున్నది.

ఇశా : అయిన యీ కరువు బారినుండి తప్పించుకొనుట ఎట్లు?

యా : పుత్రులారా! మీలో మీకిన్ని సంశయములు పొడసూపుచున్నవి కారణము తెలియకున్నది.

రూ : లేదు పితృదేవా! సంశయ మేమియులేదు. నిజమైన వార్త సంగ్రహించి ప్రయాణమునకు సమకట్టుదమని నా యూహ.

షి : మన జ్యేష్ఠుడు పలికిన పలుకులు యోచింపదగినవే

లే : ఆయన ఆచి తూచి మాట్లాడగలరు.

జెబు : ఇన్ని అనుమానములు కలిగిన కార్యము నెట్లు సాధించగలము?

ఇశా : ధైర్యమే మనకు కావలసిన అవశ్య పరికరము.

యూ : నాయనలారా! మీకెట్టి సంశయముపలదు. ఐగుప్తులో ధాన్యము నిలువచేయబడి అమ్మబడుచున్నదని రూఢిగా తెలిసియే మాట్లాడుచున్నాను. ఆ దేవదేవుడే యీ కరువు బాధనుండి కడతేర్చగలడు. సంశయము మాని ప్రార్థించి బైలుదేరుడి.

రూ : తమ్ములారా! మన ప్రయాణమున ఆ దైవమే తగినసాయ మొనర్చగలడు. గాన యిందును సందేహించుట పాడిగాదు.

అం : అటులనే పయనించెదము. తండ్రీ! మీ ఆజ్ఞానువర్తులమై కార్యమును సాధించెదము.

యా : మంచిది. ఆ దేవాదిదేవుడు మీకు తోడై యుండును గాక.

(అందరు బయలుదేరి, రెండుమూడుసార్లు స్టేజిమీదకు, తెరలోనికి తిరిగి స్టేజిమీద ఆశీనుడైన యోసేపునుచూచి సాష్టాంగపడవలెను.)

అం ; (ఒక్కసారిగావచ్చి నేలకు సాగిలపడి) నమస్కారము మహాప్రభూ!
(అని నమస్కరించెదరు.)

యో : (వారిని గుర్తించి) ఎవరు మీరు? ఎందునిమిత్తము మీరు వచ్చి యుంటిరి?

రూ : మహాప్రభూ! తమ దర్శనార్థమై బహుదూరమునుండి వచ్చితిమి నేటికి తమ దర్శనభాగ్యము దక్కియున్నది.

షి : అవును ప్రభూ! మేము హెబ్రీయులము. మిమ్ములను చూడగలిగి నందుకు మహా సంతోషముగా యున్నది.

లే : సత్ప్రభూ! మేము కనాను దేశవాసులము.

యూ : ప్రభూ! తమ దర్శనభాగ్యము కలిగినందుకు ధన్యులము.

ఇశా : రాజాధిరాజులు. మార్తాండతేజులు. మా నోము పండినది.

జెబు : ప్రజ్ఞాదురంధరా! మా సోదరులమాట అక్షరాల నిజము.

యో : ఓహో! మీ పొగడ్తలు మీ వాటము చూడగా వేగులవారిగా దోచు చున్నది. సామాన్యులుగా లేరు మీరు.

ఉ॥ వేగుల రీతిగా తగిన
వేషము దాల్చిన ధూర్తులార! మీ
రేగిన సంగతిన్ తెలుపు
డీక్షణమందున దాచకేమియున్

ాగల కార్యమున్ పిదప
కాంచుట ఖాయము వేగులైనచో
వేగమె తెల్పినన్ తొలగు
వేదనభారము లీక్షణంబునన్

రూ : మహాప్రభూ! మమ్ములను అన్యధా తలంచకుడు. మేమట్టి ధూర్తులము కాము మేము మా క్షుద్బాధను బాపుకొను నిమిత్తము తమ రాజ్యమునకు ఏతెంచితిమి.

ఉ॥ వేగులమాటు గిట్టదు వి
వేకుడ కాలమువచ్చి మేము తత్
భోగములన్ని వీడి యిట
భుక్తికి చేరిన పేదదాసులం
దాగిన తప్పునాః కొరత
ధర్మమెటంగిన రాజనందనా
అగము చేయకన్ తండ్రి
ఆకలి దీర్చుము జాలి జూపియున్

షి : అవును మహాప్రభూ! అక్షరాల మామాట నిజము.

లే : అంత ధూర్తతనంబు చూపి తమ కోపమునకు బలికాదలంచలేదు స్రత్వభూ.

యూ : మహాప్రభూ! నీ దాసులమైన మేము కరువు కాటకములందు చిక్కి కృష్ణించియుంటిమి.

చ॥ కరువులు దాపురించి బహు
గడ్డుగకాలము గడ్చుచుండగన్
కరుణనుజూపు మిత్రతతి సు
ఖాలను బొందగ దీనబాంధవా
మరణము నెత్తికెక్కి మము
మట్టిగ మార్చగ పొంచెనో ప్రభూ
తరగని సంపదల్గలిగి
ధర్మము నిల్పెడి సత్యసంధుడా

కాన యింత దయనీయ స్థితిలోనున్న మమ్ము వేగులమని భావించకు మహాప్రభూ.

జెబు ; సత్ప్రభూ! మమ్ము కనికరించి అట్టి భావమును మాపైబరుపక తగిన ఆదరణ నొసంగ విజ్ఞప్తి.

ఇశా : ప్రజాప్రభూ! మేము గూఢచారులమని తమరు తలంచిన మీరే పరీక్షకు గురిచేసిననూ నిలబడగలము. అట్లు జరిగించుటకు ఆ యెహోవా దేవునిమీద ఆనబెట్టి వచింపుచున్నాను.

యో : ఓయీ కపటవర్తనులారా! ఏమైనను మిమ్ములను నమ్మజాలను. మీరెంతమంది?

రూ : మేము పండ్రెండుమంది అన్నదమ్ములము,

యో ; మిగతా వారెచ్చట?

యూ : ప్రస్తుతము పదునొకండుమందిమే ఉన్నాము.

యో : పన్నెండవ వాడెక్కడ?

షిమి : వాడు చనిపోయినాడు మహాప్రభూ!

యో : అతని కేమిజబ్బుచేసినది?

జెబు : అడవిలో వేటకై వెళ్ళగా దుష్టమృగములు చంపివేసినవి ప్రభూ!

యో : కడపటి వారెవరు మీలో?

ఇశా : అతడు యిప్పుడు మాలో లేడుప్రభూ!

యో : మరి ఎక్కడున్నాడు?

లే : మా తండ్రికడనేయున్నాడు ప్రభూ!

యో : మీతండ్రి బ్రతికియేయున్నాడా?

రూ : అవును ప్రభూ! బ్రతికియేయున్నాడు. తాను అతిగా ప్రేమించిన ముద్దులపట్టి దుష్టమృగములపాలైనందున కృంగి కృశించి కొంత కాలమునకు తేరుకొనియున్నాడు. అందువలన చిన్నవానిని ఎక్కడికి పంపక తనవద్దనే ఉంచుకొనుచున్నాడు ప్రభూ!

షిమి : ఆయన పుత్రశోకము యింతాఅంతా కాదు ప్రభూ!

సీ॥ ఆరప్రాణమై యలరారు నాతండు
కన్నతండ్రికడను మిన్నగాను
ఆటపాటలునేర్చి ఆడుచుపాడుచు
కాలంబు గడుపును కలతలేక
విలువైన పలువలు నిలువుటంగిలతో
నిత్యము పోషించు నిర్మలుండ
విడనాడియుండిన గడుపదు తండ్రికి
కంటి ఎదుటనున్న కడుపునిండు.

ఆ॥ పుత్రశోక మింకపోలేదు తండ్రికి
అడుగడుగున తలచి ఆలపించు
తండ్రిశోకమింక తడియారనేలేదు
తగని ప్రేమచేత బొగులుచుండె

యూ : అందువలన ఆతనిని విడిచిపెట్టియుండుట కాయన ఏనాడూ యిష్ట పడడు. ఇది మా దీనచరిత్ర.

లే : కరువురక్కసి దేశమంతట వ్యాపించి వీరవిహారము చేయుచున్న సంగతి తమరెరుగనిదికాదు. దేశదేశములవారు తమవద్ద ధాన్యమున్న దని తెలిసి రావడముచేత మేమును ఆశతో ప్రాణములు నిలుప కొందమని వచ్చితిమి. అసలు పరిస్థితి చెప్పెద నాలకించు ప్రభూ!

సీ॥ దుర్భిక్షబాధచే దురపిల్లుచున్నాము
దాక్షిణ్యమును జూపు ధన్యచరిత!
బీడులు బోడులై గోడును పుట్టించి
పశువులనోటను మట్టిగొట్టె
చినుకుపడుటలేదు చిత్రంబుగానుండె
పుడమిపై కోపంబు పుట్టెనేమొ!
మలమల తిండికి మాడుట నిత్యము
పరిపాటియాయెను ప్రభువరేణ్య!

ఆ॥ కరువునుండి మమ్ము కాపాడుమో ప్రభూ
మాకు ధాన్యమొసగి మాన్యచరిత
విలువను జమకట్టి విత్తంబునొసగుదు
కరుణజూపి మాదు కరువుబాపు

జెబు : మహా ప్రభూ! యదార్థమును వచించితిమి. తమ యానతికై యీ సీనును చేచియున్నారు.

యో : మీరెన్ని చెప్పినను నాకు నమ్మకము కుదరలేదు. మీ మాటలు ఋజువుచేయుటకు మిమ్ములను బంధించెదను. మీలో ఒకరువెళ్ళి మీ తమ్ముని తోడ్కొనిరండి. అప్పుడు మీ మాటలు నమ్మెదను. (అని గానే ఒకరి ముఖము ఒకరు చూచుకొందురు.)

రూ : మహాప్రభూ! అతి కఠినమైన ఆజ్ఞ నొసంగితిరి ముందు ఒక విపత్తు జరిగిపోవుటచేత మా తండ్రిగారు అతనిని వదలుట బహుకష్టము

షిమి : ఈ విషయము వినిన మా తండ్రిగారు మరీ క్రుంగిపోయి, మా చేజే తుల మేమే మా తండ్రిని సమాధికి పంపిన వారము కాగలము.

ఆ॥ కన్నతండ్రి బాధ కనులార గాంచిన
తెలియగలదు మీకు తీరుతెన్ను
విప్పిచెప్పలేము వివరమింతకుమించి
దయను బరపుమయ్య దానశీల.

యో : ఎవరక్కడ?

1 భ : చిత్తము మహాప్రభూ! వీరి మాటలనుబట్టిచూడగా నిజముగా వీరు గూఢచారులుగా బోధపడుచున్నది. వెంటనే వీరందరిని చెరసాలలో బంధించుడి.

రూ : (గడగడ వణుకుచును) ఈ విషయము మా తండ్రిగారికి తెలిసిన మరీ క్రుంగిపోవుదురు ప్రభూ!

యో : అట్లయిన ఒకటిచేయుడు. మీలో ఒకనిని పంపి అతనిని తీసికొని రండి. అప్పుడు మీ సమస్య పరిష్కరించబడును.

లే : మహాప్రభూ! మాలో ఎవరినో ఒకరిని బంధించి మా రూకలకుతగిన ధాన్యము కొలిచి పంపిన మేము వెళ్ళి మా తండ్రిని ఎటులనో ఒప్పించి ఆ అర్భకుని మీయెదుట ప్రవేశపెట్టగలము.

షిమి : మహాప్రభూ! ఈ మనవి ఉచితమైనది. మేము చేయదగినది. కాన మమ్ము కనికరించి మాలో ఒకరిని బంధించుడి. అట్లుచేసిన మా వేదన కొంత తీరగలదు.

యో : ఎవరో యెందుకు? నిన్నే బంధించి మిగతావారిని విడిచిపెట్టెదను.

షిమి : చిత్తము మహాప్రభూ! అటులనే తమ యాజ్ఞకు బద్ధుడను.

యో ; ఓయీ సేవకులారా! ఈతనిని బంధించి మిగతావారికి వారి వారి రూకలకొద్ది ధాన్యముకొలిచి గాడిదలకెత్తి పంపుడి.

1 భ : అటులనే మహాప్రభూ.

అం : (సాష్టాంగపడి) చిత్తము మహాప్రభూ! ధన్యులము, ధన్యులము. దేవరవారు వర్ధిల్లుదురుగాక!

రూ : దయానిధీ! మేము అవశ్యము వెళ్ళి మా తండ్రిగారికి ఈ విషయ మంతయు యెరింగించి తమకడకు మా కనిష్ఠ సోదరుని తమ దివ్యసముఖమున ప్రవేశపెట్టగలము.

(అంతట నిమ్రాన్ సయించగా రూబేనీయులు మూటలు తీసికొని అటు నిటు తిరుగవలెను.) సోదరులారా! నామాట గైకొనకపోతిరి. ఆల నాడు మనము ముప్పతిప్పలు పెట్టినందుననే దేవుడు మనకీ దుస్థితి కలిగించినాడు.

యూ : నిజమే సోదరా! లేకున్న పొట్టతిప్పలకు వెళ్ళినవారిని గూఢచారులవి బంధించి ముప్పతిప్పలుపెట్టి యింత బాధకలిగించనేల? ముమ్మాటికి నీమాట నిజము.

లే : ఇంకా మనము అదృష్టవంతులము. చెరసాలలో ఆలాగే బంధించి యున్న నేమిచేయగలము?

జెబు : ఔను సోదరా! ఏదైనా మనము దూరమాలోచించి పనిచేయవలెను.

ఇశా : ఆనాడు సోదరుడు రూబేను చంపవద్దని వారించకయున్న దేవుడెంత ఘోరశిక్ష విధించెడివాడో!

రూ : హత్య అనునది పాపములతో మహాపాపమని నేనుముందేచెప్పితినిగదా అటువంటివాడు దేవుని సన్నిధిచేరుట కల్ల. అందుకనే నరహత్య కూడదని కికెనఆజ్ఞ.

యూ : ఏమైననూ మనము హత్యచేయకుండుట చాలామేలైనది. అందువల ననే మనకు కొంత శిక్ష తప్పింపబడినది.

లే : ఔనౌను. అందులకే పెద్దలమాట పెరుగుమూట యనుట. సోదరుని మాట పాటించుటచే మనకీమాత్రపు సద్గతి ప్రాప్తించినది.

యూ : సోదరులారా! ఎందుకని మనల నంతగా అనుమానించినట్లు?

సూ : కరువువలన దేశదేశములవారు ఆయనకడకు వచ్చుచున్నారు. అందువలన ఎవరు ఎటువంటివారో తెలిసికొనుటకు రాజులు తీవ్రప్రయత్నము చేయుదురు. లేకున్న రాజ్యములనే కొల్లగొట్టగల గూఢచారులున్నారు.

లే : సరే అది ఆటుపోనిండు. ఇంతకీ మనతండ్రి మన తమ్ముడు బెన్యామీనును మనవెంట పంపునా?

యూ : నాకును అదే సందేహము సోదరా!

జెబు : కలిగిన విపత్తునెరింగించి ఒప్పింతము,

ఇశా : ఏమో. ఆయన మరీచాదస్తుడు. చిన్నవాడంటే ఎనలేని ప్రేమ.

రూ : వాడు అర్భకుడుగదా! కనిష్ఠ పుత్రుడగుటచేతను. మరియు యోసేపుని పోగొట్టుకొనిన దుఃఖభారము ఆయనను యింకా విడువనందున చిన్నవానికి ఏ సమయములో ఏ ముప్పు సంభవించునోయని ఆయన అనుమానము.

యూ : ఏమైన కన్నబిడ్డగదా! అందులో మిక్కిలి ప్రేమింపబడినవాడు. ఏ తండ్రికైనను ఉంటుంది దుఃఖము.

(కొంతదూరము చనిన పిదప ఒకడు మూటవిప్పి అందలి రూకలు చూచి)

ఇశా : అన్నలారా! ఏమి యీ ప్రారబ్ధం. నేనిచ్చినరూకలుమూట నాలోపలే పెట్టబడెను. యేమి యీ ఆశ్చర్యము.

రూ : దేవుడు మనల నెందుకిట్లు పరీక్షించుచున్నాడు?

సిమ : మన కష్టములు యింకా తీరిపోలేదు. సోదరు డక్కడ బంధింపబడి యున్నాడు. తండ్రి మందలింపులా తప్పవు.

లేవి : ఔను. ముందునుయ్యి, వెనుక గొయ్యిగా ఉన్నది మనపని. దేవవి మనం తిరస్కరించినట్లు సృష్టించిన మనమేమి చేయగలము.

రూ : అదియును వాస్తవమే. సరే! కానున్నది కాకమానదు. అన్నీ ఆ దైవమే తెగటార్చగలడు.

సిమ : అయిన యిప్పుడు మనకు మార్గాంతరమేమి?

జెబు : సర్వప్రపంచమును పరిపాలించు సృష్టికర్తయే మనకండ. దిగులు పడి మనము చేయగలిగిందిలేదు. పదండి ముందుకు.

ఇశా : ఆ సర్వాంతర్యామి మనకు తోడుగా నున్నాడు. భయపడవలదు. పదండి.

(అని లోనికి వేంచేసరికి యాకోబు ఆశీనుడై యుండును.)

యా : (మూటలుచూచి ముగ్ధుడై, ఎగాదిగా అందరినిచూచి) క్షేమమా! (ఆసి) షిమియోనేడీ?

రూ ; పితృదేవా! మేము అక్కడికి వెళ్ళినపుడు రాజు వేగులవారమనిసంశ యించినారు.

యూ ; సంశయించి మమ్ములను చండప్రచండముగా ఉరిమినాడు.

లేవి : లేదు మహాప్రభూ! మేమట్టి ధూర్తులము కామని విన్నవించినాము

జెబు : కాని ఆ రాజు కోపము చల్లారినదికాదు

ఇశా : చండప్రచండముగా మాపై నిప్పులు కక్కినాడు.

రూ : మీది ఏ దేశము? ఎవరు మీరని అడిగినాడు.

లేవి : మేము ఒకేతండ్రి సంతానము. మేము పన్నెండుమందిమి. ఒక్కడు లేడు.

జెబు ; ఏమైనాడా ఒక్కడని అడిగినాడు.

ఇశా : క్రూరమృగములు మింగివేసెనని చెప్పితిమి.

రూ : పదిమందేఉన్నారు. పదనొకండో వాడెక్కడని ప్రశ్నించియున్నాడు

లేవి : అతడు అందరిలో కనిష్టుడు. అతని ముందున్నవాడు క్రూరమృగములబారిబడి చంపబడుటచే ఆయన ఆ భయమువలన అతనిని బయటకు పంపుటలేదంటిమి.

యా : అయిన అతని విషయమెందుకు చెప్పితిరి.

యూ : ఆయన మమ్ములను గుచ్చిగుచ్చి అడుగుటచే చెప్పక తప్పినదికాదు.

జెబు : అసలే మేము చారులమని ముద్రవేసి నానామాటలనుచుండగా ఈ విషయముదాచి యింకా గొప్పచిక్కు ఏర్పడియుండెడిది.

ఇశా : అటువంటప్పుడు చెప్పకతప్పేదేమున్నది? పైగా మీ తండ్రి బ్రతికి యున్నాడా అని అడిగినపుడు మేమేమి దాచగలము.

రూ : అయితే ఆతనిని తెచ్చిచూపువరకు మమ్ములను నమ్మననియు, అట్లు కానియెడల అందరిని బంధిస్తానని బంధించినాడు.

యూ : మరలా ఆలోచించి ఈ ఒక్కని బంధించెదను. ఆతనినితెచ్చిచూపిన పిదప విడుదల చేసెదననగా మేము మారుమాట మాట్లాడలేకపోయి నాము: సరేయని సమ్మతించి మా రూకలుయిచ్చి తగిన మూటలు కట్టించగా దారిబట్టి వచ్చితిమి.

యా : దేవ! దేవ! యోసేపు కాగతిపట్టె ఇప్పుడు షిమియోనునుకూడా దిగ మ్రింగవలసివచ్చినది. ఆ దుఃఖముతో కుమిలి కంటతడి ఆరక నేను ఏడ్చుచుండగా షిమియోనునుకూడా బంధించటము పైగా బెన్యామీనునుకూడా అప్పగింతలు పెట్టివచ్చియున్నారు. దైవమా నేనేమి చేయవలెను?

యూ : తండ్రీ దయచేసి మాతోపంపిన ఎట్టి ఆపదకలుగకుండా షిమియో నుతోసహా తమ్ముని మీ కప్పగించుభారమునాది.

రూ : నాయనా! అతనిని కంటికిరెప్పవలె కాపాడి తీసికొనివచ్చెదము. నా మాట నమ్ముము.

లేవి : మేము పలికినదంతయు యదార్థము. తమ్మునికి ఏ హానియు రానీ యము.

రూ : తండ్రీ! మీరు సంశయింపవలదు యోసేపు కట్లు జరిగెనని ప్రతి విషయము ఆ విధముగా జరుగునా? మీకు నేను తమ్ముని అప్పగిం చనియెడల నా యిద్దరు బిడ్డలను చంపివేయుము. నీ కడ్డురాను.

యూ : మీరు తమ్ముని మావెంట పంపియుండిన ఈసరికి రెండవమారు వెళ్ళి తిరిగివచ్చెడివారము. మీరట్లు పంపిన పిల్లలు మనము చావక బ్రదుకుదుము.

లేవి : పితృదేవా! మీకింకా అనుమానము తీరలేదా?

యూ : పితాజీ! యింకను మీరు నమ్మకున్న వానినిగూర్చి నేను పూటపడు దును. ఆ నింద శాశ్వతముగా నామీద వేయుము.

యా : ఏమో! నాకు ఎటూపాలుపోవడములేదు. సరే. అట్లయిన ఒకపని చేయుడి. కొంచెము మస్తకి, కొంచెము తేనె, బాదముకాయలు మీ గోనెలలో వేసికొని ఆ మనుష్యునికి కానుకగా యివ్వండి.

అం : మహాసంతోషము పితృదేవా, (అని బైలుదేరుదురు.)

యా : పుత్రులారా! మరొక్కమాట. మీకు తిరిగియిచ్చిన రూకలు కొను గోలుచేయనెంచిన ధాన్యముమూటలు పట్టుకొనివెళ్ళి పొరపాటుగా ఈ రూకలు మా సంచులలోనికి వచ్చినవని తిరిగి యిచ్చివేయుడి. బిడ్డలారా. ఆ మనుష్యుడు యెహోవాదేవుని కరుణాకటాక్షముచొప్పున మిమ్ములను కనికరించి షిమ్యోనును, బెన్యామీనును మీకు అప్పగించు గాక. మీరు తిరిగి తీసికొనిరానియెడల పుత్రహీనుడ నగుదునుసుమా!

రూ : మీరు భయపడవలదు. ఆ యెహోవాదేవుడు మనకు తోడైయున్నాడు. (అని బయలుదేరుదురు.)

యో : (పీఠముమీద ఆసీనుడై యుండును. అన్నలు ప్రవేశించగానే తమ్ముని చూచి దుఃఖమాపుకొనలేక ప్రక్కకుతిరిగి కన్నీళ్ళు తుడుచుకొనును.) రాజసంరక్షకా! మీరు ఒక వేటనుకోసి మా అందరికొరకు భోజనము సిద్ధము చేయుడి. వీరును మాతోకలసి భుజించెదరు. (అని లోనికివెళ్ళును.)

పో.ష. : చిత్తము. అటులనే వంటసిద్ధము చేయించెదము. (వారివైపుతిరిగి) అయ్యా! మీరందరు రాజప్రాసాదమునకు విచ్చేయుడు. అక్కడ మీకు విడిది. (అని లోనికి వెళ్ళును.)

రూ : (వారికోవారు భయముతో తిరిగివచ్చి) సోదరులారా! మనలను రాజ ప్రాసాదములో బంధించి మనపైకి లంఘించడుగదా!

లేవి : ఏమో ఎవరు చెప్పగలరు?

యూ : తండ్రి అనుమానమే బలపడేలాగున్నది. అయినను రోటిలో తల దూర్చి రోకటిపోటుకు వెరువనేల? అంతా ఆ దయామయుడే చూడ గలడు.

రూ : సోదరులారా! కానున్నదేదైనా కాకమానదు. ధైర్యముగానుండుడి. అది యెహోవా చిత్తము. [అని అనుకొనుచుండగా యోసేపు ప్రవేశించును.]

యో : (తమ్మునిచూచి దుఃఖ మాపుకొనలేక మెడమీదపడి యేడ్చును.) తమ్ముడా! ఎంతకాలమునకు నిన్ను చూడగలిగితినిరా! మన తండ్రి క్షేమమేనా?

ఉ॥ తమ్ముడ! దూరమైతిసిర
దైవము నన్నిటచేర్చనెంచగా
నెమ్మదిలేకపోయెగద
నిన్నును నాన్నను వీడినందునన్
అమ్మను బాసినాము పర
మాత్ముని వ్రాతలు సత్యమై తుదన్
మిమ్మును చూడగల్గితిని
మేలులు గూర్చెడి దైవశక్తితోన్

బె : (ఆశ్చర్యముతో) (ఏడ్వవద్దని ఓదార్చి) సోదరా!

ఉ॥ సర్వము మేలుకే జరుగు
సద్గుణవంతుడ జోసఫన్న యా
పర్వము చందమాయె సుమి
మాన్యుడ అన్నయ నిన్నుజూడగన్
గర్వమెరుంగనట్టి మన
కర్మపు శక్తిని కాంచి దైవమే
సర్వము సానుకూలముగ
సాధ్యమొనర్చెను హర్షమొందగన్

కాన ఆ దేవాదిదేవుండు, దయామయుండు ఆయన కరుణాకటాక్షము లచే నీవీస్థితిలో నిలబడి ఐగుప్తుకేకాక దూరముగావున్న మాకును బాసటయైతివి. అదంతయు ఆ దయామయుని కృపానుగ్రహములు సుమా!

యో : సోదరులారా! భయపడకుడి. నేను యోసేపుని. కష్టకాలములో మిమ్ములను ఆదుకొనుటకు దైవమే యీ రీతిగా నన్నిటకు పంపి యున్నాడు.

రూ : (అందరు హర్షాతిరేకమున చుట్టుముట్టి) తమ్ముడా మమ్ములను క్షమించుము.

షిమ : సోదరా! దైవమెంత గొప్పవాడుసుమా! ఆయన లీలలు ఎవరికీ తెలియవు.

లేవి : పరమాద్భుతము. ఆ యెహోవా దేవునియొక్క వాగ్దానఫలమిద్ది.

జెబు : ద్రోహులము సోదరా. క్షమించుము.

యో : ఇది దైవనిర్ణయము. లేకున్న మనమందరము నశించియుందుము.

రూ : తమ్ముడా. అయిననూ నీయెడల జరిగిన మాపని అత్యంత హేయమైనది. మమ్ము పూర్తిగా మన్నించు.

సీ॥ మూర్ఖులమై మేము కర్కశముగ నిన్ను
గుంటలోపడద్రోసి కూల్చినాము
హింసించియున్నాము ధూర్తులమై మేము
తమ్ముడనెడిమాట తలపకుండ
వృద్ధాప్యమున తండ్రి ముద్దుగానినుబెంచ
ఈసడించితిమెంతొ ఈర్ష్యగాను
చుప్పనాతితనము ముప్పును కలిగించు.
కలసిమెలసి యింట మెలగకుండ.

ఆ॥ ఎంత ధారుణంబు యిన్విధినుండుట.
మూర్ఖతనము తుదకు మంచివేసె
ప్రభువు కనికరింప వర్ధిల్లియున్నాము
కలతజెందవలదు కష్టములకు.

సోదరా! మూర్ఖులమై మేము నిన్ను యిక్కట్లపాల్జేసినాము. మాకు తగినశాస్తి దైవదృష్టిలో జరిగినది. ఇది మూర్ఖుల కందరకు గుణపాఠము.

యో : సోదరులారా! జరిగినదేదో జరిగిపోయినది. అది అంతయు మన మేలుకొరకే ఇక మీరు భయము చింతమాని నిశ్చింతగా యుండుడి. ఇది అంతయు దైవనిర్ణయము. లేకున్న ఈ కరువు రక్కసికి యెన్ని ప్రాణులు బలియయ్యేడివో. ఈమేలు దేవుడు మీద్వారా జరిగించెను. నిబ్బరముగా నుండుడి.

ఫ రా. : (ప్రవేశించి) యోసేపూ! నేను అంతయు సేవకులద్వారా తెలిసికొని నేనే మీకడకు విచ్చేసితిని.

యో : మహారాజా! ధన్యులము. మీ అవ్యాజమైన ప్రేమచేత నా సోదర బృందమును చూడగల్గితిని.

ఫ.రా : మీ తండ్రికూడా జీవించియున్నాడని వినియున్నాను.

యో : ప్రభువర్యా! మా సోదరులద్వారా ముందే తెలిసికొనియున్నాను. పరమ సంతోషము. (అని నమస్కరిలుదును.)

ఫ.రా. : మంచిది. ఈపని నాకును యుక్తముగా నున్నది సుమా!

సీ॥ యుక్తముగాదోచె యోసేపు నీ తండ్రి
ఇచ్చట నుండుట ఎంతగానొ
పరివారమంతయు తరుగేమి లేకుండ
కరువు దినములన్ని గడుపవచ్చు
మందకు గ్రాసంబు మస్తుగానమకూర్చు
కాలంబు హాయిగా గడుపగాను
శ్రద్ధగా వీక్షించ వృద్ధుడౌ జనకుని
రప్పించు మిచటకు రయముగాను

ఆ॥ వాహనంబులిచ్చి పరివారమును బంపి
తరలివచ్చునటుల వెరవుజూడు
చాలినంతవరకు చక్కగామనకుంటె
దిగులువలదు మనకు దీర్ఘదర్శి!

యో : పితృదేవా! అవశ్య మటులనే పరివారమునుబంపి ధన కనక వస్తు వాహనములతో నా తండ్రిని రప్పించి గోషెనులో వసతి ఏర్పాటు చేసెదను. (అన్నల నుద్దేశించి) సోదరులారా! మీరు వెంటనే మన పరివారముతో కనానుదేశమువెళ్ళి మన తండ్రిని తోడ్కొనిరండి. మీకు గోషెను ప్రాంతములో వసతి సిద్ధముచేయబడియున్నది.

(అందరు లోనికివెళ్ళగా యాకోబు స్టేజిమీద ఆశీనుడై యుండవలెను. బెన్యామీనుతోసహా అందరు ప్రవేశింతురు.)

యా : బిడ్డలారా! మీరంతా క్షేమమా? (అని ఉల్లాసంగా అడుగును). మన దేవుడు చాలగొప్పవాడు. చివరకు మనమందరము కలిసికొనగలిగితిమి.

హూ : మనమేకాదు. తమ్ముడూ యోసేపుని కలిసికొనబోవుచున్నాము.

యా : (ఆశ్చర్యమున నోటమాటరాక) నిజమా? యోసేపు ఇంకనూ బ్రతికి యున్నాడా?

యూ : ఔను పితాజీ. తమ్ముడు మమ్ములను ముందుగుర్తించి యీ నాటక మంతా ఆడినాడు.

యా ; ఏమో. ఇదంతా నాకు కలగాయున్నది. నేను నమ్మలేకుండావున్నాను (కొంచెమాగి) కలనగానే గుర్తుకువచ్చినది. నాబిడ్డ ఆనాడు కనిన కలను త్రోసిపుచ్చి మందలించాను. అయిననూ నేను దానిని నేను మరచిపోలేదు. బహుశా ఆకల మర్మము యిదేనేమో!

లేవి : నిజముగా కలగానుండవచ్చు, చనిపోయెనని ఆశలు వదలుకొని దిగ మ్రింగియుండగా తాను రాజగుట. ఈ కరువులో ఆదుకొనుట ఖచ్చి తముగా యిది ఆ కల భావమే.

ఇశా : నాన్నగారు. మీరు అనుమానపడి భయపడవలసినదిలేదు. తమ్ముడు జీవించియున్నాడు. ఇదిగో చూడండి:

జెబు : మన కుటుంబము మొత్తము తరలివెళ్ళుటకు చూడండి యీ వాహన ములు. మందిమార్బలము.

యా : (కన్నులెత్తి) హా! పరాత్పరా! నాబిడ్డ యింకను బ్రతికియున్నాడు. రవిచంద్రులు, తారాసమూహము దాసోహమనక తప్పినదికాదు నీ లీలలు అగమ్యములు. నీకు స్తుతులు-స్తోత్రములు. అబ్బాయిలూ! యిక తడవుచేయుటదేనికి? బయలుదేరండి. (అనగానే బయలు దేరుదురు.)

యా : (స్టేజిమీద ఆశీనుడగును. తండ్రి తమ్ములతో ప్రవేశించును. యాకోబు గడగడవణకుచువచ్చి, కౌగిలించుకొని)

యా : బాబూ! యోసేపు! నిన్ను క్రూరమృగములు మ్రింగివేసెననగా నమ్మి క్రుంగి క్రుశించిపోయినాను. దైవమెంత గొప్పవాడు సుమా! నా దుఃఖమంతయు మటుమాయమైనది. దేవుడు ఆశ్చర్యకరుడు. ఆలో చనకర్త. అద్వితీయుడుసుమా!

యా : (యేడ్చుచు) తండ్రీ!

ఉ॥ చూచితినాయనా తుదకు
సొంపగుమూర్తిని తృప్తిదీరగన్
వేచితి నిన్నుజూడ గడు
వేదనతోడను నిత్యమీయెడన్
సూచనలీయ నన్నిటకు
సూటిగబంపెను దేవదేవుడే
యోచన చేయబోకుమిక
యుక్తముగా గనె, దైవమిట్టులన్

కాన సర్వము మనమేలుకొరకే. అన్నలకొరకు మీరు అడవులకు నన్ను పంపడము, అన్నలచేత ఐగుప్తుకు పంపబడడము ఇది యొకకలగా ఆకల నెరవేర్చినది ఆ దైవమే. చింతమాని నాతో హాయిగా గడపండి.

యా : వత్సా! అమందానందంబున నా మనంబుప్పొంగుచున్నది. నాఆశలు పండినవి. నేను ధన్యుడను ఇక నేను చనిపోయెదను. నేను నా పిత

యొద్ద స్థిరపరచుటకు నన్ను వారిసరసన సమాధిచేయుము. ఏదీ నీ చేయి నా తొడక్రింద పెట్టి ప్రమాణము చేయుము.

యో : పితృదేవా! నీమాట చొప్పున నీ మరణము ముగిసినవెనుక మన పితరులయొద్దనే సమాధి చేసెదను.

యా ; తథాస్తు! దైవము ఎల్లప్పుడు నీకు తోడై యుండునుగాక. మీ రాజు, నీవు ఆయురారోగ్యములుగల్గి అనంతరాజ్యమును లోటుకలుగకుండా పరిపాలింపుడి. (అని చేతులెత్తి)

.... ప్రార్ధన ....

దయగలదేవా! నీ కృప మహాసముద్రమువంటిది. సముద్రమునకైనను ఒడ్డుకలదుగాని నీ ప్రేమకు అంచులులేవు. ఐగుప్తులో నీబిడ్డలు పడు బాధలనుచూచి సహింపలేక మోషేను ఎన్నుకొని ఆయనద్వారా నీ బిడ్డలను ఎర్ర్రని కడగండ్లనుండి మార్గాయాసములేకుండా నడపి తిండి, వడ్డించి బట్ట ధరింపజేసి అన్నిసలుపులోతున్న ఎర్రసము ద్రమును తృటిలో ఎండగట్టె సముద్రములో సునాయాసముగా నడిపించి పాలు తేనెలు ప్రవహించు కనాను దేశమునకు చేర్చితివి.

కరవును ముందుగా గుర్తెరిగి మేము దాని బారినుండి కాపాద బడుటకు నీ బిడ్డయగు యేసేపుకు స్వప్నమున తేటగా తెలియపరచి నపుడు ఆయన స్వప్నమునకు మేము అపోహాపడితిమి అది నిజ

మగుటకు నీ బిడ్డ యోసేపుని ఐగుప్తుకు ముందుగా పంపి నీ బిడ్డల నందరిని ఈవిధముగా రక్షించితివి. అందుకు మేమెంతో కృతజ్ఞులము

రాజ్యభారమును వహించిన నీ బిడ్డకు వివేచనాజ్ఞానము ననుగ్రహించి ఎట్టి ఆపదలు కలుగకుండా కాపాడమని వేడుచున్నాను.

ఆమెన్

— తెర జారును —



చ॥ పిదపరునందు బుట్టితిని పేదగు జ్రకయ
ఇదుములనొందినాడ పరమేశుని చూప
తదయక కొద్ది విద్యలను ధాౖతినినేర్చి
కడకు గడించినాడ కలకాలము నిల్చెడి

* * *

ముద్రిత గ్రంథములు : పదునాలుగు.

అముద్రిత గ్రంథములు : 1. ఆంధ్రరత్నము (నవల
నాటకం) 3. ఉత్తమ దేశభక్తుడు (నాటిక) 4 నే
5. ఎప్తాచరిత్ర (నాటిక) 6. భక్తవెలిపా (నాటిక)
కావ్యము) 8. ప్రశంసలు విమర్శలు (పద్యకావ్యము) !

తాపీలకు :

1. ప్రబోధా బుక్ సెంటర్ 2. !





రునందు బుట్టితిని పేదగు ఎఱ్ఱయ పున్నమాంబకున్
ములనొందినాడ పరమేశుని చూపులు సన్నగిల్లగన్
యక కొద్ది విద్యలను ధాత్రినినేర్చితి పేదవానిగన్
కు గడించినాడ కలకాలము నిల్చెడి కీర్తిసంపదల్.

* * *

ు : పదునాలుగు.

యలు : 1. ఆంధ్రరత్నము (నవల) 2. తీర్పు (సాంఘిక
ప్రేమ దేశభక్తుడు (నాటిక) 4 నేటి న్యాయము (నాటిక)
టిక) 6. భక్తవిలీపా (నాటిక) 7. మేలుకొర (పద్య
సలు విమర్శలు (పద్యకావ్యము) 9. బలిపంతులు (నాటిక)

తా పీ ం కు :

క్ సెంటర్

2. పిడపర్తి ఎఱ్ఱాకవి
బోసునగర్
తెనాలి-522201
గుంటూరు జిల్లా